క్షీరారామ ప్రముఖోల్లసత్ప్రకటపంచారామతీర్థంబులను
సారాఖణ్డదశా ప్తదీపకము లా(చం)ద్రార్కతారంబుగాన్. ౧

ఉ. దానదధీచి సోముం డవదాతయశః ప్రసారుణ్డు[2] పుత్రసం
తాన(స)మృద్ధుండై చెఱువు[3] ధర్మవివాహము దేవగేహము
......నము[4] సత్ప్రబంధము నిధాన మనం జనుచున్న సప్తసం
తానములుం బ్రసిద్ధముగ ధారుణిపై నిలిపెం గ్రమంబునన్. ౨

---

## 22.

### శ. స. ౧౦౬౯.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శ్రీకేశవస్వామి గుడిగోడమీఁద చెక్కఁబడియున్నది. పద్యములకు ముం దున్నవచనములో "శకవర్షములు ౧౦౬౯ శ్రీ ప్రభవసంవత్సర... " — 

తరువోజ.

కమల.....................................

...........................

............దివెలనుత్త

రాయనమునం గేతనామాత్యరత్న

మమర లక్ష్మీధరు డైన కేశవున

కత్యంతభక్తితో నాచంద్ర తార

---

2. ప్రసరుణ్డు- అని చదువవలయును.

3. చెఱువు- ,,

4. ద్యానము- ,,

5

కముగాంగ నిలిపె నఖండ దీపంబు
గలియుగకాలంబు కలయంత్తకెల్ల. ౧

క. పతి... ... ...
... ... ... ... ... ... ... ... ...
... ... వరుణ్డు
క్రితక్రిత్యుణ్డీయమాత్యకేతణ్డు ధరణిని. ౨

క. వినయనిధి దేచనామా
త్యునకును నెఱమాంబికకు సుతుణ్డు ధన్యుండు కే
తనపెగ్గడ కేశవదే
వనికి(౦)దీపంబు నిలిపె వసుమతిలోనన్. 3

## 23.

శ. స. ౧౦౭౦.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శ్రీకేశవస్వామి గుడిగోడమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No. 647.)

తరువోజ. ప్రభువరశకనృపాబ్దంబులు గగణ[1]
పర్వతాంబరరాత్రిపతిసంఖ్యం దనరు
విభవాబ్దమునం జైత్రవిమలత్రితీయ్య[2]
విధుసుతుదినమున విషువుసంక్రాంత్తిం
త్రిభువనమల్లధాత్రీనాధుకులన
తీరత్న మగుకామిదేవి సద్భక్తిం

1. గగన- అని చదువవలయును.
2. తృతీయ్యా- ,,

ద్రిభువనాధిపున కొ_త్తించె నఖణ్డ
దీపంబు కేశవదేవర కొప్ప. ౧

చ. ఇల నమరాద్రినాథునకు నల్లిమహీపతి కి(ద్ధ)కీ_ర్తికిం
బొలుపుగ వెన్నమాంబికకుఁ బుట్టిన లక్షుణి గామిదేవి మి
క్కిలి సిరిసంతతిం బడసి కేశవదేవరకును ముదంబుతో
నిలిపె నఖణ్డదీప మొగి నింగి శశులు గలయం_త్తగాలమును. ౨

---

## 24.

శ. స. ౧౦౭౦.

(ఇది గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందలి శంకరేశ్వరస్వామి యాల యమునం దొకఱాతిస్తంభముమీఁద నున్న యొకశాసనములోని చివరభాగము— Government Epigraphist's Collection No. 169 of 1899.)

క. ఖమునివియత్త్విశిమితశక
సమములం దనరంగ్గ విషువుసంక్రాన్తినిమి
_త్తమున సితకీర్తి భైరయ
గొమరుగ భీమేశ్వరునకు గుడి యె_త్తించెను. ౧

శకవర్షములు ౧౦౭౦ గు నేణ్టి చైత్రబహుల ౧౫ యు మం గ్గళవారము సూర్య్యగ్రహణనిమి_త్తమున సాదము భైరయ గొట్యదొ నభీమేశ్వరమహాదేవరకు అఖణ్డదీపములు రెణ్టికి నిచ్చిన ఎడ్లు ౧౦౦ వీనిం జేకొని భీమేశ్వరమహాదేవర దీవియకాంపు లైన కేతబోయణ్డును నల్లబోయణ్డును రెణ్డఖణ్డదీపములకు నిత్యఅడ్డెండు నెయి ఆచంద్రా ర్క్కముం బోయంగ్గలవారు॥

---

కి. యతిచెడినది- నెల్లమహీపతి యని యుండనోపు.

క. (నిర)తము వేయిని డెబ్బది
(పరు)వడి శకునేం డ్లమర* ఖైర(య) భీమే
శ్వరునకు నిలిపె(ను)మహిసు
స్థిరమై యుం(డ)గ నఖండదీపము లొప్పను. ౨

క. (ఇ)హపరధనసంసిద్ధిగ-
(దీని తరువాతిదాయి భూమిలోఁ బాఁతుపడియున్నది)

---

## 25.

శ. స. ౧౦౭౧.

(ఈశాసనము గోదావరీమండలములో దాక్షారామగ్రామమందు భీమేశ్వరాలయము గోడమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. IV. No. 1061.)

శా. ... ... ... ...
... ... ... ...
భారద్వాజపవిత్రగోత్రుణ్డు నా[1]శుంభన్మూర్త్తి సద్వర్త్తి వో
ల్పారంగ్గా నుదియించ్చెం[2] బ్రోలణ్డు ది......స్ఫూర్త్తికీర్త్తి న్వైమై[3]

ఉ. అర్జ్జునకీర్త్తిలోలుణ్డు సహస్రకరోపమతేజుణ్డా సహా
ప్రార్జ్జనపౌరుషుణ్డు శచివాగ్రణి[4] సన్తతపుణ్యసంచ్చయో
పార్జ్జితు ణ్డింద్రధేనుదితిజాభవదాన్యుణ్డు దణ్డనాథనా
గార్జ్జును తమ్ముంబ్రోలణ్డు[5] ధరామరవంశలలాము ణ్డుర్వ్వరను. ౨

---

* నేండు లమర- అని చదువవలయును.

1. గోత్రుణ్డును- ,,
2. నుదయించ్చెం- ,,
3. దిశావారస్ఫురత్కీర్త్తిన్వైమై- అని యుండనోపు.
4. సచివాగ్రణి- అని చదువవలయును.
5. తమ్ముంబ్రోలణ్డు- ఇది ప్రయోగవిశేషమని గ్రహించునది.

ఉ. అంబుజగర్భవంశమణి యై దయఁ బట్టపుమొట్ట యగ్రహా
రంబుగ నిచ్చి యాంధ్ర యుడురాజశిఖామణికి న్దరున్నివా
సంబెసఁగంగ నిల్పి విలసస్మతి నొప్పిన దండనాథర
త్నం బగు నాగదేవవిబుధస్తుతు తమ్ముఁడు ప్రోల ణ్డున్నతిని. 3

శకవర్ష ౧౦౭౧ నెణ్టి విషువుసంక్రాన్తినిమిత్తమున శ్రీమన్మ
హామణ్డలిక బొద్దనభీమనమంత్రి గోరణ్డప్రభువు ప్రధానయకోడ్డు దణ్డ
నాయకనాగదేవయ్య తమ్ముంప్రోలయ[5] శ్రీభీమేశ్వరమహాదేవరకుం
బెట్టిన అఖణ్డవర్తిక లోహదణ్డుదివియ ౧ణ్టికి......

క. శ్రీమహితం బగుదాక్షా
రామపురాధిపునకు(ను) సురస్తవనునకును
భీమేశ్వరునకు నతులను
ధీమాణిక్య... ... ... ४

## 26.

శ. స. ౧౦౭౧.

(ఈశాసనము గోదావరీమండలములో దాక్షారామగ్రామమందు భీమేశ్వరాల యము గోడమీఁద చెక్కఁబడియున్నది- South Indian Inscriptions Vol. IV. No 1073.)

... ... ... ...

చ. అన(ఘుఁ)... ...కుర కాతనికిం గులకాన్త యైన యం
గన ఎఱియాంబకును మదనకల్పుఁడు పుట్టెం జతుర్థవంశవ
ర్ధను ణ్డనవద్యు ణ్డుత్తమవదాన్యుణ్డు(మాన్యు)ణ్డు వీరలక్ష్మికిని
గనియగు దణ్డనాయకశిఖామణి గామన సుప్రసిద్ధుం డై. ౧

శా. ధీరోదాత్తుణ్డు గామినాయకుణ్డు భక్తిం జేసి నిత్యస్థితిని
భూరిఖ్యాతి శకక్షితీశసమములు భూశైలదిక్సంఖ్యయఁ

[5] తమ్ముంప్రోలయ ఇది ప్రయోగవిశేషము.

దారామంబుల కెల్ల నాయకమునా నత్యున్నతిం* బొల్చుదా
శారామంబున నిల్పె దీపము సదాఖండప్రభాభాసిగాను. ౨

## 27.

శ. స. ౧౦౭౧.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శ్రీకేశవస్వామి గుడిగోడమీఁద చెక్కఁబడియున్నది. ఈశాసనములో మొదట మూఁడుపద్యములును దరువాత నొకవచనమును పిదప నొకపద్యమునుం గలవు. మొదటిమూఁడుపద్యములును 84 సంఖ్య శాసనములోని పద్యములు నొక్కటే. మూఁడవపద్యము మొదటిపాదములో "ముద్దమాంబకు" అనుటకు బదులుగా "ముదువమాంబకు" అని యున్నది. ఇదియే సరియైనపాఠము. నాల్గవపద్యముమాత్ర మిచట వ్రాయఁబడుచున్నది- South Indian Inscriptions Vol. VI. No 643.)

క. ధర ౧౦౭౧ వి గ్రితశకవ
త్సరములు ... ... ...
(శ్వరునకు) నఖండదీపము
మురదధిపనిభుం డమాత్యమల్లండు నిలిపెను.

## 28.

శ. స. ౧౦౭౧.

(ఈశాసనము గుంటూరుమండలములో బాపట్లగ్రామమందు శ్రీభావనారాయణస్వామి గుడిగోడమీఁద చెక్కఁబడినది- South Indian Inscriptions Vol. VI. No. 128.)

చ. అరుదాల[1]ధర్మనిర్మ యుగునంధనరేశ్వరు సర్వ.. (వా
రికి)ం బ్రభవించ్చె నావయ .....శౌరివా

* నత్యున్నతిం- అని చదువవలయును.

1. గణమును బ్రాసయుఁ జెడినవి. "అరుతల్ల" అని యుండనోపు.

నికి జనియించ్చె గుండెన మనీషిజనప్రభు(తు)ండు వానికిం
జకితకురంగలోచనకుం జందనగంధికి గుప్పమాంబకును. ౧

క. ధీరుండు గశ్యపగోత్రో
ద్ధారుండు గుండిమడవిభుం డుదారుండు మదనా
కారుండు గవలియ యన్నండు
గారవమునం బుట్టి వంశకరుం డై పేర్మిఁని. ౨

స్వస్తి శకవర్షంబులు ౧౦౭౧ గు నేంటి ఉత్తరాయనసం
క్రాంతినిమిత్తమున—ఇత్యాది.

---

## 29.

శ. స. ౧౦౭౨.

(ఈశాసనము కృష్ణామండలములో బెజవాడగ్రామమందు ఇంద్రకీలపర్వత
ము నడుగున ఖిల మయిన యొకమండపములో నొకఱాతిస్తంభముమీఁద చెక్కఁబడి
యున్నది. South Indian Inscriptions Vol. IV. No. 731.)

తరువోజ. కరగిరివియదిందుగణనమై పరగం
గాశకునేండ్లు అక్షత్రి[1]తీయయు మి
హిరవాసరమున బాలేందుధరుండ
యిన బెజవాడ మల్లీశ్వరగారి
వల్లభునకుం గొ(ను)[2] వరవీరచోడ
వల్లభుండు అఖండవత్తిఁ[3] దీపంబు

---

1. నేండు లక్షత్రి- అని చదువవలయును.

2. ఈపాదమందు ప్రాస చెడినది. "వరునకుం గాంగను" అని యున్న సరి
పోవును.

3. ఇచటఁ గవి విసంధి చేసినాఁడు.

సురుచిరంబుగ నాత్మసుత ఎఱకమకును

...........సుభముగా ని(చ్చె)[4]

యిద్దివియకుం చెరియబోయిని కొడ్డు గాటయబోయినివసము నం బెట్టిన యినుపఎడ్లు ౫౫। వీనిం జేకొని నిత్యమానెండు నెయ్యి యాచంద్రార్క్కఃణముం బోయంగ్గలవాండు.

---

## 30.

శ. స. ౧౦౭౨.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు చెన్నకేశవ స్వామి యాలయములో నొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No. 644.)

సీ. దినకరకులుండైన త్రిభువనమల్లండు

కమ్మనాండును గుండికట్టు మొట్ట

వాడియుం జేకొని రూఢిగా నేలంగ్గం

గొట్టియదొౕన యనుపట్టనమున

నభినవరైవతకాద్రిణి[1] నొప్పిన

గిరిమింది[2]విహారేంద్ర కేతనునకు

ధనదవంశేశుండు పెనుగొండభైరవ

నాయకుకాపయనందనుండు

ఘనుండు బయ్యనసెట్టి సంక్రాంతితిథిని

మిత్తమున నేత్రశైలవియత్తలేందు

---

4. ఈపాద మసంపూర్తిగా నున్నది.

1. రైవతకాద్రిని- అని చదువవలయును.

2. మింది = మీఁది. ఈరూప మిప్పుడును పడమటిదేశమందు వాడుకలో నున్నది.

సంఖ్య సక[3]ధారుణీపాలు సమము లమరం
బ్రబలుచుండ నఖండదీపంబు నిలిపె. ౧

---

## 31.

శ. స. ౧౦౭౨.

(ఈశాసనము గుంటూరుమండలములో నాదెండ్లగ్రామమందు గోవర్ధనస్వామి యాలయములో నొకటాతిస్తంభముమీఁద చెక్కఁబడియున్నది- South Indian Inscriptions Vol. IV. No. 806.)

స్వస్తి.

శా. శ్రీమన్మార్తిక వడాలుకాటయకు రాజీవాక్షి సూరాంబ భూ
భామాసన్నిభ(నా) జనించ్చె వినుతప్రా(ధా)న్య దత్తాంత్త కు
ద్దామశ్రీ జనిమించె[1] వెన్నమ మహాధర్మిష్ఠి నాదిండ్ల(ను)
న్రామారత్నము నిలిపె[2] దీపము జగద్రమ్యంబుగా శౌరికిని.

క. కరగిరిదిగ్గితశకవ
త్సరముల శుక్లసితపక్షదశమియు విధువా
సరమున శ్రీకేశవదే
వరకును దీపంబు నిలిపె వసుమతిపెలయను. ౨

---

3. శక- అని చదువవలయును.

1. జనియించె- ,,

2. నిల్పె- ,,

## 32.

శ. స. ౧౦౭౩.

(ఈశాసనము గోదావరీమండలములో దాక్షారామగ్రామమందు భీమేశ్వరాలయములో నున్నది- South Indian Inscriptions Vol. IV. No. 1108.)

ఉ. (శ్రీ)రమణుణ్డు మణ్డలిక శేఖరుఁడ ... ...

... ... ... ... ...

శౌరగుం డాహవార్జునుఁడ భణ్డనభీము

... ... ... ... ... ౧

చ. ... ... ... ... ...

... ...నాంబరగు గుండియబోయుని కంబుజాన్వయ గో

మలి కులదీపకంబు గుణమండ... ...

... ... ... అక్షత్రరాశుల

గ్గలముగ నిచ్చి ప్రోచె నురుఖండితవిద్విషుం డెటియం డిద్ధరను.[1]

చ. శకవమఁ...ల[2] సంఖ్యగుణశైలవియత్స్రిత[3]రశ్మింబవ్వఁంగాం

బ్రతి[4] ... ...మం బయిన పంచమితో విషుసంక్ర వేల న

స్థకరిపుండైన ఈశునకు[5] దక్షవిరో(ధి)కి డాకరేమి దీ

పక(మొ)నరించ్చె శౌర్యాఁ[6](వ)రభాగఁవు డ్డిద్ధవిలాసుండై[7].

1. డెట్టం డిద్ధరను- అని చదువవలయును.
2. శకవరుషాల- అని కవి ప్రయోగింపనోపు.
3. వియత్స్రిత- అని చదువవలయును.
4. "బ్రతి" అనినఁ బ్రాసచెడును. 'బ్రకటు' అని యుండనోపు.
5. యీశునకు- అని చదువవలయును.
6. శౌర్యాఁ- ,,
7. విల్గాసుండై ధరను- అని యుండనోపు.

## 33.

### శ. స. ౧౦౭౩.

(ఈశాసనము గుంటూరుమండలములో నరసారావుపేట తాలూకాలోని చెన్నుపల్లి అగ్రహారమందు పశ్చిమపుదిక్కున పానసవేశ్వరస్వామి యాలయమం దొక శిలాస్తంభముమీఁద చెక్కఁబడియున్నది.)

స్వస్తిశ్రీ.

సీ. శ్రీకుబేరాన్వయశేఖురుం[1] డనఘుండు
వాసయసెట్టికి వనజపత్త్ర
నేత్రి దండ్యమకు సుపుత్త్రుండు గోసనయ
సెట్టి గోట్టియదోనం జెఱువు గుడియుం
గట్టించి పరివారగణసహితముగ సో
మేశ్వరదేవర సాశ్వతముగ[2]
నిలిపి తటాకంబు మలపించి వ్రిత్తులు
మానులకును గుడిసానులకును
నట్టువోజులకునుం బెట్టుచ హావిబలి[3]
యర్చనలకు మేలియమదునకును
దేవభోగముగను దేవర కాచంద్ర
తారకముగం జెఱువు నూరు నిచ్చె. ౧

క. శ్రీవైశ్యవంశవర్ధనుం
డీవసుమతిం గోసనిసెట్టి యీశ్వరునకు గౌ
రీవరునకు సోమేశ్వర
దేవర కొప్పంగ నఖండదీపము నిలిపెను. ౨

---

1. శేఖరుం- అని చదువవలయును.
2. శాశ్వతముగ- ,,
3. బెట్టిహవిర్బలి- అని యుండనోపు.

క. పురగిరిది క్తతిశకవ
  త్సరములం బుణ్యతిథి విషువుసంక్రమమున ని
  ద్ధర గొసనయసెట్టి సుధా
  కరమాళికి నిలిపె నావగంబము ప్రీతిని. 3

(ఈపద్యము పిదపఁ బైయర్థమే విపులముగా గద్యరూపమున వ్రాయఁబడియున్నది.)

---

## 34.

శ. స. ౧౦౭౩.

(ఈశాసనము గుంటూరుమండలములోని బాపట్లగ్రామమందు శ్రీభావనారాయణస్వామి గుడిగోడమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No. 132.)

క. (శ్రీ)రమణు(ం)డ త్రిణ[1] (పికసహ
  కారు)ండు వోఆండూరివిభుండు గశ్యపగోత్రో
  ద్ధారు(ం)డనం బరగె నిల సర
  సీరుహాసంభవకులుం(డు) శివదేవు(ం)డనను. ౧

క. (అ)తనికిం బుణ్యమూత్రిణకి
  నాతతగుణనిధికి గుండమాంబకు ధన్యో
  పేతుండు సత్యనిత్యని
  కేతనుం(డై) పుట్టె మంత్రికేత(ం)డు వేడ్కన్. ౨

చ. అతనికి(ం) బ్రీతు(ం)డై ముద్దమాంబకు[2] (ం)బుట్టెనమాత్యవిద్ద(ం)డూ
  ర్జితతనయశాలి యాతనికి సింధురగామిని దోనమాంబకును

---

1. దత్తిణ- అని యుండవలయును.
2. ముమువమాంబకు- అని యుండవలయును. చూ. శా. 27

హితమితభాషి గేత(ం) డుదియించ్చె[3] సమస్తజనానురాగు(ం) డై
శతమఖభోగి వాని అనుజన్ముండు[4] విద్దనమల్ల(ం) డున్నతిని. 3

స్వస్తి శ్రీశకవర్షంబులు ౧౦౭3 గు నేంటి ఉత్తరాయన సంక్రాంతినిమిత్తమున శ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్లదేవ పౌత్రపి(చోడ)మహారాజుల(రాజా)ధ్యక్షవిద్దనపెగ్గడకొడుకు మల్లయపెగ్గడ కమ్మనాంటిలోని ప్రేంబల్లి భావనారాయణదేవర కాచంద్రార్కం మఖండవర్తిందీపమునకుం బెట్టిన బిరుదువూడలు (౧౨)-ఇత్యాది.

---

## 35.

శ. స. ౧౦౭౪.

(ఈశాసనము కృష్ణా కుండలములో అవనిగడ్డగ్రామమందు లక్ష్మీనారాయణస్వామి యాలయములో నొకఱాతి స్తంభముమీఁద చెక్కంబడియున్నది- South Indian Inscriptions Vol. IV. No. 945. See No. 943 )

క. శ్రీరమణీయు రణవిజయ
శ్రీరమణీయు నిందుకుందసితవిపులయశ(ః)
శ్రీరమణీయు వరియింతురు
(గౌ)రి కులోత్తుంగచోడగొంకనరేంద్రున్. ౧

ఉ. ఆరయ నట్టిగొంక నిపునన్వయ భిత్యుండు వి(శ్వ)శాసన
శ్రీరమణీయమై తనరం జింతమనాయకు డుద్ధరించె గొ
ల్లారివిభుండు వంశమహిమోన్నతు లన్నియు నేప్పడం బ్రతీ
హారిపదార్థపూర్వముగ నారవితారకశాసనంబుగాన్. ౨

క. అతనికి నగణ్యపుణ్యా
వ్రతయగుగుండమకుం బుట్టె వసుమతి వీర

---

3. డుదయించ్చె- అని చదువవలయును.

4. వానియనుజన్ముండు- ,,

ప్రతుండు పడిహారిముత్తన
హతశత్రుచయుండు నాయకాభరణుం డై. 3

చ. మురహరవిక్రముం డైన[1]ముత్తనకు న్నరలోకరంభ నాం
బరగిన మేడమాంబకు శుభస్థితిం బుట్టె మనుష్యలోకసుం
దరి యన నొప్పు నూంకమ లతాలలితాంగ్గి సుమధ్య మల్లికా
(పరిమ)లగన్ధి మత్తపికభాషిణి గోత్రపవి(త్ర)మై[2] మహిని. ౪

ఉ. శ్రీయుతపుణ్యకీర్త్తనలు సేకొని నూంకమ భక్తిం జోడనా
రాయణ దివ్యసన్నిధిం జిరస్థిరదీపము నిల్పె నాశకా
బ్దాయతి వేదశైలగగనాబ్జమితంబుగ ఫాల్గునామల
శ్రీయువతీశసత్తిథిని జెల్వుగ నారవితారకంబుగానూ. ౫

---

## 36.

శ. స. ౧౦౭౫.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు చెన్నకేశవస్వామిగుడిలో నొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది. ఱాతిమొదటిభాగము గుడిగోడలోఁ జేరినందునఁ గొన్నియక్షరములు కనఁబడుటలేదు- South Indian Inscriptions Vol. VI. No. 634.)

సీ. ... ... ... ...
... ...

1. డయిన- అని చదువవలయును.
2. రై- ,,

మఱి తల్లి జడచోడమన్మథాలారవి
కులతిలకాంకయగు[1] తొండికవియట్ట
యంధ్రాధిపతి విజయాదిత్యదేవండు
మహిమమెయిం[2]దన మేనమామ యట్ట
కరికాలకులరవి వరకామచోడధా
త్రీవిభు ... ... ...
... ... ... ...
... ... విధ్ధినెసగినదియు
లలితలక్షణోపలక్షితశ్రీదేవి
కీర్తిమహిమ వొగడం గేవలంబె. ౧

క. చోడనిమఅందలు విజయుతు[3]
కోడలు కామక్షితీశుకులసతి నిఖిలా
మ్రేడితచరిత్రం బ్రిపసతు
లీడే శ్రీదేవికిని మహీదేవి కిలను. ౨

.. ... వత్సరములు ౮గు శ్రాహిని శకవర్షములు౧౦౭౫గు నేంట్టి విషువుసంక్రాంతినిమిత్తమున- ఇత్యాది.

---

1. యగు అను నక్షరములు తీసివైచిన గణములు సరిపోవును.
2. మహిమమై- అని చదువవలయును.
3. విజయుని- అని యుండనోపు.

# 37.

శ. స. ౧౦౭౬.

(ఈశాసనము కృష్ణామండలములో అవనిగడ్డ గ్రామమందు లక్ష్మీనారాయణ స్వామి యాలయమునం దొకఱాతిస్తంభముమీఁద చెక్కఁబడియున్నది- South Indian Inscriptions Vol. IV. No. 943.)

క. శ్రీకమనియ్యుండు పుణ్య
శ్లోకుం (డ)ధఃకృతవిలాససురవిభుండు జితా
మిత్రానీకుండు[1] యశ
శ్శ్రీకరుణ్డు[2] వెలనాంటి గొంకన్నృపసింహుం డిలను. ౧

ఉ. ధారుణి నట్టి గొంకవసుధావిభు నన్వయభృత్యుం డైనకొ
ల్లూరివిభుండు శౌర్యగుణమొప్పంగం జింతమనాయకుండు దే
జోర(మ)ణియ్యుం(డై) పడసె సుస్థిరలీల వెలుంగంగాం బ్రతీ
హారిపదా(ర్థ)మాద్యమున నారవితారకశాసనంబుగాఁ. ౨

క. ఆతనికి వికసితాంభో
జాతానన గుండమకును జన్మించె జగ
త్ఖ్యాతుండు ముత్తమనాయకుం
డాతతతేజుండు నాయకాభరణుం డై. 3

చ. క(లి)యు(గ)శూద్రకుం డన జగంబున వీరగుణప్రసి(ద్ధుం)డై
వెలసినయట్టి ముత్తనకు...మద(నా)ంగ్గి సుమధ్య పుణ్యదో
హాళి యననొప్పు(మే)డమకు నభ్యుదయంబుగం బుట్టె నంబుజో
(జ్వ)లదలలోలనేత్రి మదసామజయాన లతా(సుమ)ల్లికా
మిలితసుగన్ధి గొమ్మమన మేరు(వదాన్య) మహీతలంబునఁ. ౪

1. జితానేకామిత్రుండు- అని చదువవలయును.
2. శ్రీకణ్డు- ,,

శకవర్షములు ౧౦౭౬ అగు నేంటి శ్రావణశుద్ధైకాదశి యు గురువారము(న) శ్రీధనదప్రోలిచోడనారాయణదేవరకుం బడిహారి ముత్తియనాయకుని కూ(ం)తుఱు కొమ్మమ దనకు ధర్మ్మవుగా(న)ఖం డదీపమునకుం బెట్టిన బిరుదుగద్యలు ౧(౬) వీనిం జేకొని కండ్ల బ్రహ్మ నకొష్ఠు (ముత్తయ) దనపుత్త్రానుపౌత్త్రికము నిత్యమానెండు నెయి ఆచంద్రార్కము నడపంగలవాండు॥

---

## 38.

శ. స. ౧౦౭౬.

(ఈశాసనము కృష్ణామండలములో పెదకళ్ళేపల్లిగ్రామమందు శ్రీ నాగేశ్వర స్వామిగుడిలో నొకఱాతిస్తంభముమీంద చెక్కంబడియున్నది- South Indian Inscriptions Vol. VI. No. 88)

స్వస్తి.

సీ. శ్రీసోమవంశవిశేషకుండగు బల్ల
భూపాత్మజుండు దిలీపనిభుండు
చాలుక్యభీమభూపాలుండన్నరపతి
కబ్బలదేవికి నగ్రసుతుండు
బల్లాధినాథుండు భరథ[1]భగీరథ
ప్రస్తుతచారిత్రం బరగుచున్న
యాతనివల్లభి సీతాసమాన సో
మలదేవి సుభ[2](గు)ణలలిత కడలు

---

1. భరత- అని చదువవలయును.
2. శుభ- ,,

పల్లి నాగేస్వరునకు[3] దీపం బఖణ్డ
వర్త్తి యాచంద్రతారకవర్త్తి గాంగ
నిలిపె రసగిరివ్యోమేందువిలసితంబు
లైె శకాబ్దంబు లువ్వీర నభిమతముగ. ౧

## 39.

శ. స. ౧౦౭౬.

(ఈశాసనము కృష్ణామండలములో పెద్దకళ్లేపల్లి గ్రామమం దున్న శ్రీనాగేశ్వరస్వామిగుడిలో నొకఱాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No. 87.)

స్వస్తిశ్రీ॥

ఉ. బల్లనరేంద్రువల్లభి (శు)భస్థితిం గామపరాణి శ్రీకడ
(ల్పల్లిభు)జంగమేశునకు భక్తి న(ఖం)డితదీప మాశశాం
కోల్లసితా(భ) మై వెలుంగుచుండంగ నిలిపె[1] ర(సా)ద్రిఖేందులను
సల్లలితంబుగాంగ ......... శారదములు ధరణీతల(ంబు)నను. ౧

## 40.

శ. స. ౧౧౫౦.

(ఈపద్యములు గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శంకరేశ్వరస్వామి యాలయమునం దొకఱాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నవి. వీనికి ముందు కొంత వచనభాగము కలదు. South Indian Inscriptions Vol. VI. No. 625.)

క. శ్రీరమణుం డర్త్తిసూరిచ
కోరసుధాకరుండు హారితగోత్రుండు గులని

౩. నాగేశ్వరునకు - అనిచదువవలయును.

౧. నిల్పె - ,,

స్తారుండు వాముదిండి[1] విభుండు
సారగుణుండు పుట్టె నయితశౌరి ధరిత్రిని. ౧

క. ఆతనికిం బుణ్యాధన్యున
కాతతగుణమునకి మేడమాంబకు ధర్మో
పేతుండు వారిజభవసం
జాతకులోత్తముండు పుట్టెం జామెన యనంగాను. ౨

క. సితకీర్తి సామిరాజున
కతులితచారిత్ర గుండమాంబకు లక్ష్మీ
పతిసముండు పుణ్యచరితుండు
ధి తిసురగిరినిభుండు బ్రహ్మదేవండు పుట్టెను. ౩

క. మతిగురుం డా బ్రహ్మన శ్రీ
యుతుం డనఘుండు భూసురాన్వయోత్తముండు దయా
న్వితుండై ధర్మ..ర్చు... ...
మతిప్రియ వేదవిహితమార్గండు భర్తిని. ౪

సీ. అంబరవసువియదబ్జితాంశుమితశక
ధాత్రి పాబ్దములు[2] బహుధాన్యవర్ష
వైశాఖసితపక్షవారిజోదరతిథి
గురువాసరమున నగుప్వర్గాంగం
గడుభక్తి విషుప్రసంక్రాంతిం గొట్టియెదూన
శంకరునకు భక్తశంకరునకుం
బరమధర్మాత్ముండు బ్రహ్మదేవండు దన
తల్లిదండ్రులకును దాతలకును

1. ఇచ్చట నొకమాత్ర యధికమైనది-వాద్దిండి-అని చదువఁదగును.
2. ఇచ్చట నొకమాత్ర యధికమైనది. లువర్ణము వదలి పలుకవలయును.

బేర్మితోడం గరము ధర్మువుగాంగ న
ఖండదీప మఖిలమండనముగ
నిలిపె వంశమెల్ల వెలుగంగ నాచంద్ర
తారకంబుగాంగ ధాత్రిమింద.* ౬

# 41.

శ. స. ౧౦౫౦.

(ఈ శాసనము గుంటూరుమండలములో అమరావతిగ్రామమందు అమరేశ్వర స్వామియాలయమునం దుత్తరద్వారమునొద్ద నున్న చిన్నమండపములో నొక స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. VI. Nos. 233, 234 and 235.)

శా. శ్రీకాంతానిలయంబు శిష్టజనతాసేవ్యంబు శాలీవనా
నీకసాంద్రజలాశయోన్నతలసన్నీరేజశోభాన్వితం
బాకీర్ణద్విజనందనంబు రమణీయ్య[1] స్థానమై కన్నులో
నాకాధీశపురంబుకంటె నిది మేలునా నొప్పు రాయూరిలను. ౧

ఉ. రాజితకీర్తి లక్ష్మి యకరంబునం[2] గన్నకులోద్భవులు భర
ద్వాజమునీంద్రగోత్రజులు వలువురు[3] వారలలోన సద్గుణ
భ్రాజితకీర్తి గంట్టెన ప్రభావసమన్వితుం డుద్భవించె దే
జోజయశాలి సూంత్రితవచోనిధి బంధుజనాశ్రయుం డనను. ౨

క. కందం॥ సాధులకం ద్రవ్వండనను
సాధుజనానంద్దకరుండు ననతనికి నం
భోధిగభీరుం డన నా
రాధితశంకరుండు దేవరా జుదియించ్చెను.[4] 3

* మింద = మీఁద.

1. రమణీయా - అని చదువవలయును.

2. అకరమన - కరరహితమైన యగ్రహారమా?

3. వల్వురు- అని చదువవలయును.

4. రాజుదయించ్చెను- ,,

ఉ. వృత్తం॥ వానికి జన్నమాంబకును వంశకరుం డుదయించె[5] బ్రహ్మతే
జోనిధిబాంధవాబ్జవనశూర్య్యుఁడు[6] గొమ్మయపూర్ణ్ణచంద్రబిం
బానన సర్వ్వలక్షణగుణాన్విత సూరమ(ం బెం)డ్లి యయ్యె సం
తానవివృద్ధిపొంది నుచితస్థితిం జారుచరిత్ర నిల్వంగాను. ౪

చ. జననుతకీర్త్తిఁ గొమ్మయకు సామజగామిని సూరమాంబకును
మనుచరితుఁడు సత్పురుషమాన్యుండు భూసురవంశశేఖరుం
డన నుదయించెం[7] బెన్నయ గుణాగ్రణి వారిజపత్రలోలలో
చన యగుప్రోలమాంబ విలసత్స్మితిం బెండ్లి[8] యయ్యెం బ్రీతితోను.

ఉ. లాలితసర్వ్వలక్షణవిలాససమృద్ధికి నాస్పదంబు నాం
జాలి పతివ్రతావిమలచారుచరిత్రకు నాలవాలమై
శీలమునను సమానమగు శీతకు[9] ధాత్రికి నద్రిజాతకుం
బ్రోలమ నన్యకామినులు వోలుదురే గుణగౌరవంబునను. ౬

ఉ. ప్రీతివిశుద్ధసత్వుండగు పెన్నయకును దలితాంబుజాస్య భూ
జాతసమాన ప్రోలమకు సత్త్వనిసజ్జనబంధుమిత్రసం
ఘాత(సు)పోషకల్పతరుకల్పుండనం బ్రభవించ్చె నెల్లణ్డు
ద్యోతసరత్స[10]మాగమవిధుద్యుతి సర్వ్వజనానురాగుండై. ౭

మ. పదుమూఁడ్లేణ్ల[11] నాండ్రమాత్యపదవిం బ్రాపించ్చి తత్సంపదా
స్పదుండై సత్కవిబంధుమిత్రజనసంరక్షాకారి యై సాధుస
మ్మదశుద్ధప్రతిభాప్రపంచ్చితలసన్మార్గస్థితిని సంతతా
భ్యుదయుండై విలసిల్లె నెల్లణ్డు జగత్పూర్ణ్ణచ్ఛకీర్త్తిచ్ఛవిని. ౮

---

5. కరుం డుదయించె- అని చదువవలయును.
6. సూర్య్యుఁడు- ,,
7. నుదయించెం- ,,
8. బెండిలి- ,,
9. సీతకు- అని చదువవలయును.
10. శరత్స- ,,
11. పదుమ్మూఁడ్లేణ్లుల- ,,

ఉ. మానితసచ్చరిత్ర(కు)పమాన మమానుషమానవంబు సం
త్తానకతుల్య మర్థిజనతాప్రణుతాభిమతార్థ మీఁగి మెయి[12]
మానవనాథమాన్యతకు మన్యపమంత్రి సమానుఁ డాంచ్బల
శ్రీనిధి నెల్లనిని విబుధమిత్రు నుతింత్తురు సత్కవీశ్వరులు. ౯

ఉ. మన్యపవైభవుం డభిగమశ్రుతిచోదిత ధర్మవర్తి సౌ
జన్యనిధాను డర్థిజలజాతహితప్రియనందనుండు వా
గ్జన్యవిశేషనిష్టపదసత్యయుధిష్ఠిరుఁడై వెలింగ్గె భూ
మన్యకుంోత్తము డతిసమగ్రత నెల్లఁడు ధన్యుఁ డున్నతిని. ౧౦

ఉ. పాలితధర్మమార్గుఁ డనుపాలితసత్యవచోవిలాసుఁడు
త్కాలితపాపకల్మషనికాయ విశుద్ధపవిత్రగోత్రుఁ డా
మ్రేలిత సర్వశాస్త్రమతి మిత్రజనాంబుజమిత్రమూర్తి ది
గ్గాలితకీర్తి నిశ్చలితలక్ష్మిసమన్వితుఁ డెల్లఁ డుర్వరను. ౧౧

శ్రీయమకేశ్వరదేవర శ్రీపాదారాధకుఁడైన నల్లపాచార్యనిలిఖితము

(ఆ స్తంభముమీఁదనే వేఱొకప్రక్కను)

చ. క్రితకనియోగలబ్ధ మగుకేవలలక్ష్మికి నీవంగి గర్వప
ర్వతశిఖరాధిరూఢు లగువారల నవ్వు ననింద్యమూర్తి ని
గ్గతకలికాలకల్మషుండు గావున నెల్లంఁతు ని(ర్మళాతిని)
శ్చితమితవాణి గావున విశుద్ధయశోనిధి (దా)న కావునను.[13] ౧౨

సీ. శకంబ్రిపావనీపాల[14] నికర మంబరగజ
వియదిందుసంఖ్యం దద్విషువదమల
సంక్రాన్తివేల నిశ్చలభక్తితో దీప
(మా)చంద్రతారార్కమై వెలుంగ్గ

---

12. మై- అనిచదువవలయును. 14. శకనృపవత్సర-అనియుండవలయును,

13. ఈపాదమందు యతి తప్పినది.

నె త్రించ్చెం బరమేశు నిందుశేఖరుం డమ
రేశ్వరదేవర కిల ప్ర(భూ?) ప
కొలము ప్రీతితోడ నివేద్య మిన(ని
భూ?) ని (చిమా?) నులకర్థ మిచ్చె[15]

సరసిజాసనవంశశేఖరుఁడు పురుష
కారగుప్తుండు వంశవిస్తారకుండు
గరణమెల్లండు సుచరితాభరణుఁ డిటు
భాసురంబుగా ధర్మ్మవు సేసి వెలసె. ౧3

(పై శాసనపుఁ బంక్తులనడుమ నీ క్రిందిపద్యము చెక్కఁబడియున్నది. ఇటీవల చెక్కఁబడినట్లు కనఁబడుచున్నది.)

ఉ. దిట్టకవిప్రసిద్ధిగల తిప్పనసత్కవి సార్వభౌముం డా
మెట్టనినం[16]గవిత్వమున నెవ్వరు వానికి నీడుగామిం దాం
గట్టినగోచి దక్క నొకకాని యు డాంప్పక యత్తిఁ[17] కోటికిం
బెట్టుట బాపురే బిరుదువెట్టిన వానిక చెల్లు నుర్వరను. ౧౪

15. ఈపాద మసన్వయముగానున్నది.

16. నెట్టనిన- అని చదువవలయును.

17. యతిఁ- „

## 42.

### శ. స. ౧౦౮౦ (ప్రాంతము.)

(ఇది గుంటూరుమండలములో సిరిపురముగ్రామమందు రామేశ్వరాలయమున నొకబాతిమీఁద నున్న శాసనము చివరభాగము. శాసనకాలమును దెలుపు మొదటి భాగము పోయినది. Government Epigraphist's Collection No. 49 of 1909.)

చ. ఇల వెలనాంట్టిచోడినృపు నిచ్చినదత్తము దీని కన్యథా
దలంచినదుర్వినీతుండు మ(దం)బ్బతి దుర్దశం జెంద్ది వంద్దియా
కులుండై[1] కాలుప్రోలు సొరం గొట్టిన విడ్డ్యఱ గాన కంద్ద తా
నెలకొని రౌరవాంబుధి మునింగ్గి యడంగ్గు ననేకకాలములు. ౧

చ. చెఱువులు నూఱు వేన్నస లచింత్యము సత్రము లగ్రహారములు
గుఱుకొని లక్షగంగు లొకకోటిశివాలయములు సహస్రకం
బఱువదివేలు వావులు సతాధ్వరములు[2] వదివేలు బ్రహ్మణుం
జెఱిచిన(య)ంతపాతకము సిద్ధము దీనికి హింససేసినన్. ౨

క. తనదత్తమన్యదత్తం
బనంజనము స్వదత్త మెట్లట్ల[3] రక్షిం
పనియతం డఱువదివేలేం
డ్లనవరత మమేధ్యక్రిమి[4]యై జనియించ్చును. ౩

1. కులుండయి- అని చదువవలయును.
2. బావులు శతాధ్వరములు- ,,
3. మెట్లులట్లుల- ,,
4. మమేధ్యముక్రిమి- అని చదువనొప్పు.

## 43.

శ. స. ౧౦౮౧.

(ఇది గుంటూరుమండలములో కంచెర్ల గ్రామమందు భీమేశ్వరాలయమునం దలి తాతిస్తంభముమీఁది శాసనము.)

క. శ్రీయువతీప్రియు నాభీ
తోయజమునం బుట్టె బ్రహ్మ దురితేతరుం డా
తోయజభవునకు శాలం
కాయన(ఋషి) పుట్టె ధర్మ్మకర్మ్మరతుం డ(నంగా)ను. ౧

సీ. తద్గోత్రమునం బుట్టె ధన్యుండు వెగ్గడ
దే(చి)దేచికిం బురంధ్రీలలామ
కామవాంబకుం బుట్టెం గాంతియుక్తుండు గోం
కండతనికినాచమ కతిముదమునం
బుట్టె మేడండు జగత్పూజ్యుం డాతనికి దా
మవకు జన్మించ్చిరి మహితకీర్త్తి
ధనుండు నల్లండు గోంక్కండును దే(చి)యును వీరి
లోన నల్లయ బుధలోకనుతుండు
చోడకన్నరవిభుచేత సూర్య్యవంశ
వర్య్యచే మంత్రిపదవియు వసుమతీశ
చిహ్నములుం బెక్కు వ్రిత్తులుం జిరతరముగం
బడసి పురుషార్త్థ[1] గౌరవప్ర(వు)డుం డగుచు[2]. ౨

చ. ఒఱపగు శాకహాయనము లువ్విఁ గజాంబరచంద్రసంఖ్యగా
వఱలిన కన్యసంక్రమణవాసరనాథుదినంబునందుం గ(ం)

1. పురుషార్థ- అని చదువఁదగును.
2. ప్రాభుండగుచు- ,,

8

(చె)ఱ్ఱ్వల[3] భీమనాథునకుం జెలువుగ[4] నిల్పె నఖండదీపకం
బె(ఱుకు)వమంత్రి నల్లండు ది(నే)శసుధాకరకతారకంబుగాను. ౩

స్వస్తిసక[5] వర్షంబులు ౧౦౮౧ గు నేంటి కన్యసంక్రాంత్తినిమి
త్తమున శ్రీమన్మహామండలేశ్వర కన్నరదేవచోడ(మ)హారాజుల పెగ్గ
డ నల్లపెగ్గడ కంచెఱ్ఱ్వలభీమేశ్వరదేవరకు నఖండదీపమునకు నిచ్చిన
మొదవులు పండ్రెండు వీనిం బయింబెట్టకొని యొడయరి యాచంద్ర
తారకముగాం దనపుత్రానుపవుత్రికమున[6] నిత్యమానెండు నెయి వో
యంగ్గలవారు.

---

# 44.

శ. స. ౧౦౮౨.

(ఈశాసనము గుంటూరుమండలములో బాపట్లగ్రామమందు శ్రీభావనారా యణస్వామిగుడి గోడమీంద చెక్కంబడి యున్నది. South Indian Inscriptions Vol. VI. No. 181.)

క. అనుపమ మగుబండారము
నసఘం బగు సన్ధివిగ్రహి...... బె
క్కు ని(యోగ)ంబులుం దేజము
గొనకొని వడసిన యమాత్యకొమ్మండు ప్రీతిని. ౧

చ. కరగజకేందు[1]సంఖ్య శకకాలము వొల్పుగ భావపట్ట(దే
వరని) నఖండదీప మతిభాసురలీల వెలుంగ్గ నిల్పె వి
స్తరమతిం దల్లిదండ్రులకు ధర్మ్మువుగా శశితారకంబుగా
గురుభుజుం డిద్ధవిక్రముండుం గొమ్మనపెగ్గడ ధన్యుం డున్నతిని. ౨

---

3. చెఱువుల- అని చదువవలయును.
4. జెలుగ- ,,
5. శక- ,,
6. పౌత్రికమున- ,,
1. కేందు- ,,

# 45.

శ. స. ౧౦౮౨.

(ఈశాసనము గుంటూరుమండలములో బాపట్లగ్రామమందు శ్రీభావనారాయణస్వామిగుడి గోడమీఁద చెక్కఁబడియున్నది. ఇదియు 44 వ సఖ్యశాసనము నొక్కఁడివే. South Indian Inscriptions Vol. VI. No 184.)

ఉ. శ్రీరమణీయయ్య[1] వత్సుండు వశీకృతలోకుండు విప్రవంశని
స్తారణకారణుండు విలసద్గుణభూషణుఁ డిష్ట(జన)[2]ర
క్షారతుఁ డుత్తమోత్తముండు గౌశికగోత్రుండు గొమ్మశౌరి ధ
ర్మోదారుచరిత్రుం డప్పెరువంగూరిపురీశుండు ధన్యుం డు(న్నతిని).౧

ఉ. ఆవసుధామరేశ్వరున కన్వయరత్న(ము కొ)మ్మమాంబకును
భూవినుతుండు విప్రకులభూషణుఁ డుద్భవమయ్యె (గొంక) ధా
త్రీవిభుసంధివిగ్రహి(య)తిస్థిరచి(త్తుం డ) మాత్యరత్న మా
గోవిందన[3] వంశవర్ధనుండు గోత్రపవిత్రుండు ధాత్రిం జిత్రయని. ౨

చ. గురునిభుం డయ్యమాత్యనిధి (గొ)గ్గనపెగ్గడ కంబుజాస్యయం
బురుహదళాక్షి గేతమకుం బుత్రుండు గౌశికగోత్రుం డంబుజో
దరపదభక్తియుక్తుండు ప్రతాపది(నే)శుండు గొంకధారుణీ
శ్వరునకు సంధివిగ్రహి ప్రసన్నమనస్కుండు గొమ్మం డిమ్మహిని. 3

క. రమణీయయ్య(ధ)నదపురవర
మనురంగ నిజరాజధాని యయ్యుండంగ నక[4]
రము నెల్లూరును లోపుగం
గ్రమ మొనరంగ నేలె బాహుగర్వము వెలయను. ౪

---

1. రమణీయ- అని చదువవలయును.
2. (బంధు) అని యుండనోపు.
3. ఇచట ఛందోభంగ మైనది. గోవిద అనికాని గోవన అనికాని యుండనోపు.
4. ఇక్కడ ఛందోభంగము గలిగినది- సరియైనపాఠము చింత్యము.

క. వననిధిపరివ్రిత మాదిం గల[౬]
యనఘశివాలయము లెన్ని......(కాం)
చనకలశంబులు వెట్టిన
యినినిభుం డగు గొంక్కధారుణీశ్వరు చేతను. ౫
(అసంపూర్తి)

---

# 46.

శ. స. ౧౦౮౩.

(ఈశాసనము గుంటూరుమండలములో నరసారావుపేటతాలూకా తిమ్మాపుర గ్రామమున కుత్తరముగా నున్నరాతిస్తంభముమీఁద చెక్కఁబడియున్నది.)

శ్లో. శ్రీజయలక్ష్మీ......ఃపరమణ్ణలికాన్వయాబ్జదే...మధామః
వైభవజితమహేంద్రో(జ)యతికులోత్తుంగచోడగొంకన(రే)ంద్రః.

వ. ఇట్టి శ్రీ గొంకరాజుల కిష్టభృత్యుండైన (స)రణయ నామావలి యెట్టిదె. ౨

ఉ. శ్రీవిలసద్విలాసజి(త)జిష్ణునిచే నహీసీమ క్రిష్ణచే
దేవసమానుచేత నరదేవశిఖామణిచేత ధాన్యవా
టీవరవ్రిత్తిశాసనపటీయశి నాంటగ్గి మేలు నాయక
శ్రీవిభుం డొప్పెం బోతయ వశీక్రితసజ్జనలోకుం డై భువిని. ౩

క. జితకాశి దూబవాడకుం
బతి పోతయనాయకునకు భావజరాజ్యా
న్వితలక్ష్మి యుదయమయ్యెను
సుతను శ్రీవిజితరంభ సొక్కమ ధరణిని. ౪

---

౬. మహింగల- అని చదువవలయును.

చ. మితగుణశీలరూపములె[1] మేనక నూర్వ్వశి రంభం బోలి సం
స్తుతి కెఱవట్టమై వెలయు సాక్షను శీలమునందు మానవీ
వితతి నధఃకరించి సుకవిద్విజబాన్ధవ(వంది)బ్రిన్దస
మ్మతవిపులార్త్థదాన[2]మహిమం బ్రభ దాల్చినధన్య వెంప్పనను.

క. ధర సనదవోలిపట్ణే
శ్వరదేవ(ర) నర్త్తకియ త్రివర్గ్గఫల(శ్రీ)
కర సాక్షమ మాహేశ్వర
పరివార(స్త్రీ)లలోనం బ్రస్తు(తిం) దన రెను. ౬

చ. సురవనితావిలాస యు(గుసా)క్షమ కుద్భవమైరి దేవతా
వరము(నం జేసి) వీరభటవంశవిరాముణ్డు(కా)ముణ్డును మహీ
నరనుతశౌర్య్యమూర్త్తి సరనణ్డును గోకమహీశుదేవియై
పరగిన ల(క్ష్మి)దేవియనం బ్రస్తుతి కెక్కిన కామదేవియును. ౭

క. నరనుతరాజకలాగమ
గురుణ్డు గులోత్తుంగ్గచోడగాంకధరిత్రీ
శ్వరుం డీశ్వరాంశ మగుటం
బరగిన(శ్రీ)కామిదేవి పార్వ్వతిం బోలుచు, ౮

క. కామాంబిక నిజాగ్రజుఁ గ
గామని పరభటవారని ... మన ... బుధచి[3]
న్తామణి నన్వయవనజవ
భోమణి ... ... ం దగు నభోమణితేజును. ౯

1. రూపముల- అని యుండనోపు.

2. విపులార్త్థదాన- అని చదువవలయును.

3. ఈపద్యము మొదటిరెండుపాదములకు సరియైనపాఠము దొరకలేదు.

క. అనిం గం(చె)ఱుల[4]కోటను
గణపతిసైన్యంబు నోడిచి ఘనుగొంకమహీం
(మనసిజు) మెచ్చించ్చి సురాం
గ్గనలకుం గాముణ్డొ[5] సనియె గాముణ్డు మహీమను. ౧౦

క. వీరుణ్డు సరనయచోడిను
హీంరాజేంన్రుణ్డు మెచ్చ (నే?) అూరి యనిని
శూ(రా?) రిం జెండరాయని
వారిధిసార నెగిచి వైరి(వర్గ)ముం జంప్పను. ౧౧

క. సరణయశొ...మంత్రిపనయ
గురుణ్డు గు(లోత్తు)ంగ్గ(చోడ)గొంకధరిత్రీ
శ్వరుణ్డును......చ్చి యిచ్చెం
బరగిన జేవరము గొణ్డపడుమటిం[6]గొనను. ౧౨

క. పరగుశకాబ్దములు జగ
త్తరివియపిందుమితినో(న)రంగా నిస్సీం వి
స్ఫురదుత్తరాయనం(బున)
గిరిపశ్చిమజేవరమునం గీర్త్తనం దనరెను. ౧౩

మ. వరగోకేశ్వరనామధేయమున సర్వజ్ఞుం ప్రతిష్టించ్చి సు
స్థిరత న్నిత్యనివేద్యభూసురభు(జ)ిద్దీపార్థమై యొప్పంగా
శరణ్టీటుం దటాకమును ధరయు శశ్వత్తైలయంత్రంబు నా
స్ఫురదిందుమ్యదిశాంబరామరకు భిద్యుభ్బతారకంబై చనను. ౧౪

వసంతతిలకము-శ్రీరామరామం ద్రిపశేఖరవిష్ణుమూర్త్తి
వీరాగ్రగన్య భుజవిక్రమ పార్త్థవేంద్ర

4. చెఱ్ఱుల- అని చదువవలయును.
5. గాముణ్డయి- ,,
6. భువ్గణ్డను తరువాతియక్షరము సందేహాస్పదము.

మారారియంఘ్రియుగమానసరాజహంస
కారుణ్య(దా)నసహకారమహీజరా(జ)[7] ౧౫

సీ. అత్రిపల్లియభూమియందు ప్రసిద్ధమై
జీవపోషన[8] సేయు దేవరంబు
భాండపక్ష్మ...... బడిగొలాజ్ఞను మ్రాలం
బెక్కు గయ్యాము...... వేరుకొనినం
బతి మెచ్చి శాసన...... యుడు
నందుగోకేశ్వర దేవరనిలిపి
వరకా......నిలక్ష్మి వల్లభువల్లభి
గామిదేవుల పేర గట్టిచెఱువు[9]
హర్నకు నిచ్చి ధర్మార్థి వృద్ధిగాంగ[10]
దీ(ప)వర్తికి గానువు ద్రిథము సేసి
భూసురోత్తమవరులకు భూమిదాన
మిచ్చి నల్లిండ్లు నిలిపి తానిత్తపట్టు. ౧౬

... ... ... ... ...

సోదరీపతులదానంబు శాశ్వతముగ
...మనుగాను వాత్రియై ధర్మము
(దీనితరువాతిభాగము ఖిలమైనది.)

---

7. నాలుగుపాదములందును చివరియక్షరము దీర్ఘముగా నుచ్చరింపవలెను.

8. పోషణ యని కవిహృదయము కాని యీరూపము సాధువు కాదు.

9. రెండు, మూఁడు నాలుగు పాదములకు సరి యయిన పాఠము తెలియకున్నది.

10. ఈపాదమందు యతి తప్పినది.

# 47.

శ. స. ౧౦౮౫.

(ఈశాసనము గుంటూరుమండలములో నరసారావుపేటతాలూకా చేజెర్లగ్రామమందు శ్రీకపోతేశ్వరస్వామిగుడిలో నొకతాతిస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. VI. No. 598.)

సీ. స్వస్తి శకాబ్దములు శరగజదిక్సంఖ్య
విదితసుభాను[1]సంవత్సరమున
పౌష్యమాసంబున బహులపంచాదశి
నమరేంద్రగురువాసరమునం బరగి
యతిశయం బగునుత్తరాయనసంక్రాన్తి
నఖిలలోకేశ్వరుం డనంగనొప్పి
నాలుగువేలును నన్నూటనలువది
నాల్గులింగంబులనడుమ నెలసి
సిద్ధవంద్యుం డైనచేంజెఱువులకపో
తేశ్వరునకు భక్తి శాశ్వతముగ
మనుమకులుం డైన తొడూరిఘనుండు మార
మాంబకేతం డఖణ్డదీపంబు నిలిపె[2].

1. వక్లంస్వభాను- అని యుండవలయును.
2. ఈయెత్తుగీతిలో మొదటివి రెండు నాటవెలఁదిపాదములు, చివరవి రెండును తేటగీతపాదములు.

## 48.

శ. స. ౧౦౮౭.

(ఇవి గుంటూరుమండలములో సత్తెనపల్లితాల్లూకాలోని సిరిపురగ్రామమందు మూలస్థానరామేశ్వరాలయములో నొకరాతిమీఁది శాసనములోని పద్యములు. కొన్ని సంస్కృతపద్యములపిదప నీతెనుఁగుపద్యము లున్నవి. నాయొద్ద నున్న ప్రతిబింబపుఁగాగితము కొంచెము శిథిలమైనది- Government Epigraphist's Collection No. 49 of 1909.)

మ. సకలోర్వీజనరక్షణక్షము దశాశాపూర్ణకీర్తిలతా
ప్రకటుఁ......దుర్జయకులప్రాకారు సత్యవ్రతు
న్నకవీంద్రాసురభూజముఁ (బ)డిగులార్జును వీరరాజేంద్రచో
డికుమారుం బ్రణుతింపరే శుభటకంఠీరు[1] న్నుదారుం బ్రభుఁ.

చ. ఇల వె(ల)నాంటిగొంక్క వసుధేశుతనూ(భవు)ండైన ...భూ
తలపతి సోడపట్ట...దంబునం(గ) భుజాబలంబు(నం)
(గొలను జ)యించ్చి యుద్ధు (రి)పుకుంజరు భీమనింజంపి ఆంధ్రభూ[2]
తలము వదాఋవేలు సతత.........లీలఁ. ౨

---

## 49.

శ. స. ౧౧౯౦.

(ఈశాసనము గోదావరీమండలములో దాక్షారామగ్రామమందు భీమేశ్వరాలయము గోడమీఁద చెక్కఁబడియున్నది. ఇది మిక్కిలి పెద్దపద్యశాసనము కాని, చాల భాగము శిథిలమై పోయినది- Suth Indian Inscriptions Vol. IV. No. 1039.)

ఉ. ... ... ... సత్యపీంద్రసం
తానము వైరివారిదసదాగతి బంధునిధానుం డన్వయాం

---

1. శుభటకంఠీరవుఁ- అని భావము కావచ్చును.
2. యాంధ్ర- అని చదువవలయును.

భోనిధిచంద్రముండు నృపపుంగవుండు......వీరల
శ్రీనిలయుండు వానీరుహ[1]మిత్రసు తేజుండు క్రీడివారులను[2]. ౧

చ. గుణనిధి వానినందనుండు గొమ్మని పాలుం డరాతిరాజవా
రణవరకుంజర[3]మృగరాజు వివేకచతుర్ముఖుండు ధీ
మణి విహగేంద్రవిక్రముం డమానుషపౌరుషశాలి వంశభూ
షణుండుసుభిన్నధానుండునిశాకరతుల్యుండుగాన్ని(నెంతయును).

ఉ. మండితకీర్తిలోలుండు రమాప్రియుం డాతనియగ్రపుత్రుం డా
ఖండలవైభవాస్పదుండు గండవిభుండు విరోధిబ...(వే)
దండకిశోరకేసరి వదాన్యదధీచి పరాంగనామనో
జుండు మురారివిక్రముండు శుద్ధచరిత్రుండు సన్నుతుం డిలను. 3

చ. తదవరజుం(డు న)ంబి[4]హిమధామయశోనిధి వైరిభూపసీ
రదపవనుండు బాంధవసురద్రుమ మబ్ధిగభీరుం డంగనా
మదనుండు వంశవర్ధనుండు మ ...
... ... ... ... ౪

(చిట్టచివరిభాగము)

శకవర్షంబులు ౧౦౯౦ నేంటి రాజరాజసం.........రాయ
ణసంక్రాంతియు సోమవారమునాండు శ్రీభీమేశ్వరమహాదేవరకు ఓం
గ్గే(అనూగ్గ)మున త్రైలోక్యమల్ల.........జిక్కభీమరాజుధర్మా
ర్థముగాను పెట్టిన (అ)ఖండవర్తిలోహదండ్డుదివియ యొక్కటికి
కిలరమున బోలున(లు)వురుం బూ(ట్ల)గాను మూ(డ్డా)వు నడపున
కాంబోలసూరె వసమునం బెట్టిన ఇనుపయెడ్లు ౫౫l.........గొని
నిత్యపడి గొలావంగల త్రిభువనాంకుశ నేతిమాన(౧)- లిఖితం పెద్ద
నాచార్యేణ.

---

1. వారిరుహ- అని చదువవలయును.
2. క్రీడి బోయిలను ,,
3. కుంజరారి- అని చదువవలయును.
4. నంబి యనునది శాఖాపేరు.

## 50.

### శ. ష. ౧౦౯౩.

(ఇది గుంటూరుమండలమందు సిరిపురములో రామేశ్వరాలయమం దున్న యొక శాలిమీఁది శాసనములోని భాగము- మిగిలిన భాగము చక్కఁగాఁ దెలియుట లేదు.
Government Epigraphist's Collection No. 48 of 1909.)

మ. ... ... ... ... మం
బరదుగ్ధాబ్ధిసురాపగాంబురజతప్రఖ్యాతకీర్తిప్రభం
గర మొప్పను సహకా(ర)వల్లభు నిపౌషుశ్రేష్ఠు గోంకక్షితీ
శ్వరసూనును వెలనాంటిచోడి(జ)నపునుసామాన్యమేపేర్మొ(నను).

* * * * *

సీ. రామనిధివ్యోమరాజవత్సరములు
వర్తిల్లంగా ఖరవత్సరమున౦
బరగిన(యట్టి యీ) గిరిపశ్చిమంబులోం
బూంన్లు[1] వండ్రెం డ(పూ)వ్వభా(తి)
శ్రీకరంబై యొప్పు సిరిపురంబున నుత్త
రాయణంబునయందు రమణతోడ
వటులంగ్గ నెఱియన వరతనూజుం డగు
బొల్లన బాలేందుభూషణునకు
పరమభక్తిం దాండిపాలగోత్రుణ్డు మ
నోజనిభుండు గడుమహోత్సవముగ
మణ్డితంబుగా నఖణ్డదీపము వెట్టె
వారిజాప్తచంద్రతారకముగ. ౧

1. బూండులు- అని చదువవలయును.

# 51.

## శ. స. ౧౦౯౫.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శ్రీశంకరేశ్వరస్వామిగుడిలో నొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది. ఈపద్యము చివరను "(స్వ)స్తిశ్రీమత్త్రిభువనచక్రవర్తిః శ్రీరా(జరా)జదేవర విజయరాజ్యసంవత్స(రం)బులు ౨౯ శాహిశకవర్షంబులు......" అని యున్నది. వర్షసంఖ్య ఖిలమైపోయినది. ద. శా. 6-188 సంఖ్యగలశాసనములో "స్వస్తి శ్రీమత్త్రిభువనచక్రవర్తిః శ్రీరాజరాజదేవ(ర) విజయరాజ్యసంవత్సరంబులు ౧౧ ణ్డగు శాహి శకవర్షంబులు ౧౦౭౮ ది యగు నేంటి ఫాల్గుణబహుళ యేకాదశియు శనివారము నాంను"—ఇత్యాదిగా నున్నది. దీనిని బట్టి రాజరాజదేవరరాజ్యము ౧౦౬౭ వ సంవత్సరమునఁ బ్రారంభమైనట్లు కనఁబడుచున్నది కావున నాతనిరాజ్యకాలములో ౨౯ వ సంవత్సరము ౧౦౯౫ శకసంవత్సర మగును. South Indian Inscriptions Vol. VI. No. 626.)

చ. ... ... ... ... ...
...త మగుచుండం (గ)...వరకాం(త్రి)దీపమా
యతిశరకాండ[1]శకాబ్దముల న్వెలసిల్లుచుండం(గా)
నతిసయ[2]లీలతో విషు(వన)ద్దు వినిమ్మలధర్మమూర్తియై.

(మొదటిపాదమును రెండవపాదములోఁ గొంతభాగమును ఖిలమైపోయినవి.)

---

1. శరకాండదిగ్మిత- అని యుండనోపు.
2. నతిశయలీల- అని యుండవలయును.

## 52.

### శ. స. ౧౧౦౦ ప్రాంతము.

(ఈశాసనము గోలకొండదేశములో వెలిగండల యనుప్రాచీననామముగల కరీం నగరముపట్టణమునందు అవ్వల్ తాలూకాదారు (కలెక్టరు) కచ్చేరీలో నున్న యొకఱాతి మీఁద చెక్కఁబడియున్నది. అక్షరముల యాకారమును బట్టి ౧౨ వ శతాబ్దము లోని దని తోఁచుచున్నది.)

స్రగ్ధర. శ్రీకాన్తాకాన్తుచే (నా)శ్రితవిబుధజనాశీస్స్థిరప్రాజ్యరాజ్య
శ్రీకాన్తాకాన్తుచే విస్ఫ్రితనిజభుజనిస్త్రింశనీతాన్యరాజ
శ్రీకాన్తాకాన్తుచే దిక్షితిగగనసమాక్లిష్టవిస్పష్టకీర్తి
శ్రీకాన్తాకాన్తుచే నూర్జితరిపునృగరాజీమృగారాతిచేతన్. ౧

చ. ౹౹ పరనరపాలమౌళిమణిభాసురదీప్తిలతావితాన వి
స్ఫురితపదాబ్జుచే నహితభూతలనాధవరూధినీసరో
వరమధనప్ర(భూ)తమదవద్విరదాధిపుచే విరోధిభూ
ధరశిఖరప్రభిన్నవిదితత్రిదశేంద్రనిశాతహేతిచేన్. ౨

క. సుతకరిపరిమృగపతి ... తి
సుర(స)తి(క)మలసరసిరుహా- ౩

(అసంపూర్ణము.)

## 53.

### శ. స. ౧౧౧౦.

(ఈశాసనము దాక్షారామమునందు భీమేశ్వరాలయమం దున్నది. శాసనకాలము గలమొదటిభాగము ఖిలమైపోయినది. "శ్రీమన్మహామణ్డలిక దోరపనాయకుల ప్రధాని సోమనపెగ్గడ కొడ్కు దత్తెనపెగడ" శ.స. ౧౦౮౦ మున శ్రీభీమేశ్వరదేవర కఖండ వర్తిదీపము నిలిపినట్లు ౧౧౭౯ సంఖ్యగల శాసనమువలనఁ దెలియుచున్నది గానఁ బ్రస్తు

ఈశాసనకర్త యగుసోమనప్రెగ్గడ యాదత్తామాత్యునికొడు కని తలంచినచో నీశాసనకాలము ౧౧౧౦ (౧౦౮౯+౨౧) అని యూహింపవచ్చును. South Indian Inscriptions Vol. IV. No. 1180.)

శా. భారద్వాజపవిత్రగోత్రుఁడు జగత్ప్రఖ్యాతిగాం బెట్టెం భూ
(హారా)భుం డ్డొరగాండివల్లభుఁడు దత్తామాత్యసోముండు దా
క్షారామప్రముఖోల్లసత్ప్రకటపంచారామతీర్థంబులను
సారాఖండదశాప్తదీపకము లాచంద్రార్కతారంబుగాన్. ౧

ఉ. దానదధీచి సోముం డవదాతయశఃప్రసారుఁడు[1] పుత్రసం
తాన(స)మృద్ధుండై చెఱ్వు[2] ధర్మవివాహము దేవగేహ(ము)
...వనము[3] సత్ప్రబంధము నిధాన మనంజనుచున్న సప్తసం
తానములుం బ్రసిద్ధముగ ధారుణిపై నిలిపెం గ్రమంబునన్. ౨

## 54.

శ. స. ౧౧౨౨.

(ఈశాసనము గుంటూరుమండలమునం దమరావతిగ్రామములో అమరేశ్వరుని యాలయమునకు వెలుపల తూర్పుదిక్కునం బాతియున్న యొకశాలిపలక మీఁద నున్నది- South Indian Inscriptions Vol. VI. No. 216.)

—। మొదటివైపు ।—

ఉ. శ్రీపరమేష్ఠిపాదసరసీరుహయుగ్మమునందు సంభవం
బై పరగెం జతుర్థకుల మందులంబుట్టిరి భూరికీర్తులు
(ద్దీపిత)ధర్మచిత్తు లిన తేజు లనేకులు సద్గ(ణ)...ం
దీపుడమిం బ్రసిద్ధముగ నెజ్జమనాయకుం డున్నతస్థితిన్. ౧

1. ప్రసరుఁడు- అని చదువునది.
2. చెఱువు ,,
3. ముద్యానము ,,

చ. ఘనుండు దుదియించ్చె[1] నాతనికిం గంజదళేక్షణ రేకమాంబకుం
దనయులు వుట్టి రిద్ధగుణధాములు సోమనవెన్నవలు యశో
ధనులన నందు సోమయకుం దమ్ము ... ... పనాయకుండ్డు స
జ్జన(రవి)జన్మ డాతనికిం జం ... ... ... కసానికిఁ. ౨

(దీనిపిదప నీవైపునఁ గొన్నిపంక్తు లున్నవి. అవి సీసపద్యభాగములుగాఁ దోఁచుచున్నవి. పాదవిభాగము చేయుటకుఁ గూడ ననుకూలముగ లేవు గావున విడువంబడినవి. ఎఱ్ఱమనాయకుం డొకానొక పూండిలో తటాకము త్రవ్వించిన ట్లున్నది.)

— రెండవవైపు —

క. కరనయనశశిధరిత్రీ
పరిగణనం బొంది శకనృపాలాబ్దంబు
ల్వరగంగ నక్షతదియయు
ధరణీసుతదినమునందు దాత్పయ్యఁముతోను. 3

స్వస్తి శ్రీమతు గొట్టిపత్తి ఎఱ్ఱమనాయకుండు శకవర్షములు ౧౧౨౨ గు నేంటి వైశాఖశుక్ల త్రితియ్య భౌమవారమునాండు దనతల్లి (తరువాతిభాగము ఖిలమైనది.)

---

## 55.

శ. స. ౧౧౨౨.

(ఈశాసనము గుంటూరుమండలమందు అమరావతీగ్రామమందు అమరేశ్వరస్వామియాలయము వెలుపల తూర్పుదిక్కున పాఁతియున్న యొకఱాతిపలకమీఁద నున్నది- South Indian Inscriptions Vol. VI. No. 215.)

శా. శ్రీరమ్యంబగు వారిజాసన......పట్టమ్మఁధ
మ్మాఁరంభుం డిల నప్పనా... ..ద్యస్మూర్తిఁగా వానికిం

1. దుఁదయించెఁ అని చదువవలయును.

దారాకల్పవధూ...... గువిద్దాసానికిం బుత్రకుం
డారంగా......బైబుధు లత్యంత్తంబు వన్నిఁ౯ంపంగాఁ౯. ౧

చ. గుణ(నిధి స)జ్జనప్రభుండు గొంటెనపెద్దికి సత్పతివ్రతా
(మణియ)గు మాంకమాంబికకు మానుషపౌరుషగౌరవ ద్వి(జా
గ్రణి) నిజభక్తితోషితవిరాజితచంద్రధరుండు సత్య(భా
వ)ణుం డుదయించ్చె నూర్జితలసన్మతి యప్పనపెద్ది యిద్ధ(రఁ౯)౨

శా. ప్రస్తుత్యంబుగ నిట్లు దా నుదయమఇ[1] భాస్వద్దశా...ండై
స్వస్తిశ్రీవిభుం గేతభూవిభు నిజస్వామిని సదాసు......
తస్తోత్రశ్రవణియ్యం[2] జేయుచును మిత్రశ్రేణి రక్షించుచో
న(స్తోకు)ండై యప్పదేవండు సముద్యత్కీర్తిఁ౯ వర్విఁ౯ న్మహిని.

క. విద్వత్సభం (జె)ప్పందగును
సద్విజు రాయూరిపూర్వఁ౯శాసను శ్రీభా
రద్వా(జ)గోత్రు శివుచర
ణద్వయపూజితుని నప్పనం బ్రథిత(యు)శుఁ౯. ౪

చ. అమలశకాబ్దములు గరసహస్రకరక్షితిసంఖ్య(గా)ంగం బౌ
ష్యము సితపక్షశై వతిథి నారు దినంబున నుత్తరాయనం
బమరిన సంక్రమాణమున నప్పన వెట్టె నఖండదీప ము
త్తముం డమరేశుమ్రోల శశితారక మొప్పి వెలుంగుచుండంగాఁ౯.

---

1. మై- అని చదువవలయును.
2. శ్రవణీయుం- ,,

## 56.

### శ. స. ౧౧౩౧.

(ఈశాసనము గుంటూరుమండలమందు సత్తెనపల్లి తాలూకాలో వేల్పూరి గ్రామమందు శ్రీరామలింగేశ్వరస్వామియాలయము వెలుపలిమండపములో నొకస్తంభముమీఁద చెక్కఁబడియున్నది- Government Epigraphist's list No 554 of 1925)

చ. శకసమములు మహీగుణవృషధ్వజసంఖ్యగం జైత్రకృష్ణప
 క్షకతిథిం జంద్రజాహనజసంక్రమణంబున వేల్పునూరితే
 నికి వరరామనామునకు నెమ్మిం బ్రదీపము గేతవల్లభో
 త్సుకమతిం బెట్టె దాం గసది సూరమదేవు లఖండ్డ మున్నతిని.

శ్రీమన్మహామండలేశ్వర కోటకేతరాజులు భోగస్త్రీ కసది సూరమదేవులు శకవర్షంబులు ౧౧౩౧ ణ్డాగు నేంట్టి చైత్ర బ౨ బుధవారమున విషువుసంక్రాంతియందు దమతల్లి యమరసానికి ధర్మార్థంముగా వేల్పు- (అసంపూర్తి.)

---

## 57.

### శ. స. ౧౧౮౦ ప్రాంతము.

(ఇది కృష్ణామండలము నందిగామతాలూకాలోని మోగల్లుగ్రామమందు వేణుగోపాలస్వామిగుడియెదుట నున్నతాతిమీఁది శాసనభాగము. శాసనసంవత్సరమున్నభాగము ఖిలమైపోయినది. కాని గద్యభాగములో నీదానము కాకతీయగణపతిదేవుని పుణ్యమునిమిత్తము చేయఁబడినట్లున్నది. కావున, శాసనము శ. స. ౧౧౮౦ ప్రాంతమునాఁటి దనవచ్చును- Government Epigraphist's Collection Nos. 265-67 of 1924.)

శా. శ్రీమంతుం డగుబచ్చునామయం బ్రభాశ్రీరమ్యు శ్రీరాముండే
 జోమిత్రుం డగునన్నపోతి దయంగాచుం గాత నిత్యంబు సు
 త్రామారాధితపాదపంకజసముద్యత్సుందరుం డైనశ్రీ
 భామాధీశుం డభీష్టసత్ఫలము లొప్పం బ్రీతితో నిచ్చుచుం. ౧

దీనితరువాత సీసపద్య మున్నది, గాని, ఖిలమైనది. దానియంత మొదలి యెత్తుగీతి—

ప్రస్తుతంబుగా విలిచి గోపాలదేవు
నకు హితముగ నాచంద్రతారకముగాంగ
దేవభోగంబుగా నిచ్చె ధీరనుతుండు
బచ్చుసూర్య్యణుండు సుజనైకబాంధవుండు. ౨

## 58.

శ. స. ౧౧౭౬.

(ఈశాసనము గుంటూరుమండలములో కొణిదెనగ్రామమందు శంకరేశ్వరస్వామి యాలయములో నొకతాతికంబముమీఁద చెక్కఁబడియున్నది- South Indian Inscriptions Vol. VI. No 628)

శా. శ్రీమత్కౌస్తుభరత్నభూషణరుచిశ్రీరమ్యవక్షస్థలుం
డామందారలతాంత్తదామనవదివ్యామోదపాదాబ్జజా
తామేయామరసింధువారిక్రితపూతాసేష[1]లోకుండు నాం
గా ముల్లోకవిభుండు నక్రిగలం డైక్యవ్యాప్తి దా నాద్యుండై.

ఉ. ఆతరిదాల్పునాభిదళితాబ్జమునం దుదియించ్చె బ్రహ్మ సం
ప్రీతిగ నావిరించ్చికి మరీచి జనించ్చె మరీచి కన్వయ
ఖ్యాతుండుపుట్టెం గస్యపుండు[2] గస్యపుం[2] డనుమునికుద్భవించ్చెలో
కాతతరమ్యమూర్తిగమలాప్తుండుసూర్య్యుండువంశకర్త్తయై.

మ. ఘనుఁడాసూర్య్యునకన్వయాదిజుండనంగ్గారాజధర్మ్మంబుతా(౦)
దనువై శాశ్వతరాజయోగమున నొంద్దం బుట్టె వైవశ్వతుం[3]

1. శేష- అని యుండవలయును.
2. గశ్యపుండు- ,,
3. వైవస్వతుం- ,,

డనఘుం డాతని కుద్భవించె మను వృద్యద్వేదశాస్త్రార్థత
త్వనిజాచారసమస్తధర్మనయశాస్త్రప్రౌఢి కాచార్యుఁడై. 3

గద్య. ఇట్టి మనువంశంబున నిక్ష్వాకు వుట్టె నిక్ష్వాకువంశంబునం గకుస్థుండు వుట్టె నాతనికిం బ్రిథివి దనపేరం జేసినం బ్రిథుండు[4] వుట్టెం బ్రిథువంశంబున మాంధాతృండు వుట్టె మాంధాంతవంశంబునం బురుకుత్సుండు వుట్టెం బురుకుత్సవంశంబున సాగరంబు దనపేరం జేసిన సగరుండు వుట్టె సగరవంశంబున దిలీపుండు వుట్టె దిలీపవంశంబున భాగీరథి దనపేరుగాం దెచ్చిన భగీరథుండు వుట్టె భగీరథవంశంబున నతీతానాగతవంశకర్త యైనరఘువు వుట్టె రఘువంశంబున నారాయణావతారుండైన శ్రీరాముండు వుట్టె శ్రీరామవంశంబున నలుచక్రవర్త్తి[5] వుట్టె నలునికిం బుండరీకుండు వుట్టె పుండరీకవంశానుక్రమంబున నాదిరాజులకంట్టెం బ్రసిద్ధుండై కరికాలచోడచక్రవర్త్తి వుట్టి భానువంశంబు గరికాలవంశంబునాం బేరుకొని చతుస్సాగరపరియంత్త[6]మహీచక్రంబు నిర్వక్రంబుగా వాలివాతం బాలించ్చి-

క. కరికాలచోడనరపతి
వరగంగ నిజలాంఛనములు బలువిడి హిమవ
ద్గిరితటముల సేతుమహీ
ధరతటముల నిలిపెం జక్రధరతుల్యుం డై. ౪

క. కావేరిదరులు గట్టంగ
వేవేపల్లవుండు దనదు వెట్టికి రామిఁనిం[7]
దావాని నుదిటికను వోం
గావడిం గరికాలవిభుండు గాలం దుడిచెను. ౫

4. జేసినప్రిథుండు- అని యుండవలయును.
5. నలచక్రవర్త్తి ,,
6. పయ౯ంత్త అని యుండవలయును.
7. రామిని- ,,

క. ఇనుపాదము లర్చింపంగ
జనుచో(ం)జని అర్ఘ్యమంత్రజలపాత్రలు దా
వినువీధి నొంగం బంచ్చెను
ఘనముగం దనయాన వొడిచి కరికాలుం డిలను. ౬

క. అట్టి కరికాలనృపతికిం
బుట్టెను మహిమానచోడు భువినతనికిం దాం
బుట్టిరి గరికాలుండు సిరి
కట్ట ననుంగులుం దొండమా(నఘ)నదశవర్ష్మలు. ౭

క. ఆకరికాలనరేంద్ర
ప్రాకటవంశమునం బుట్టె భాస్కరకులర
త్నాకరచంద్రుండు రిపునృప
భీకరుం డధికుండు చోడబిజ్జన బిరుదై. ౮

క. మూడిగ బిజ్జన దనురెం
డాడినభూపతుల శిరము లసిముఖమునం జెం
డాడుచుం గయ్యము లిరువది
యేడెన్నంగం బొడిచె జయమహీవల్లభుం డై. ౯

క. బల్లహుతో ఘనబిజ్జన
వ్రల్లాటమున[8]వచ్చుపాముం బట్టినం గని యా
బల్లహుం డిచ్చె గుణాంకము
గొల్లభిగొని జనులు గండ్డగోపాలుం డనను. ౧౦

క. దండ్డి (జగ)దొబ్బగండ్డండు
గండ్డరగండ్డండు వీరఖణి బిజ్జన యు

8. వ్రల్లటమున- అని యుండవలయును,

ద్దండుండు దాం బనుమువ్వుర
గండ్డం డనుధార నిలిపెం గటకములోనను. ౧౧

చ. త్రి॥ బిరుదనం జన్నయా తెలుంగుబిజ్జననునుమండు[9]మల్లిదేవం డ
చ్చెరు వగుచున్నపొత్తపియ చెన్నగుపీడుగ వాలి పాకనాం
డిరువదియొక్కవేయిం జననేలుచుఁ బల్లవులదండ్లు గెల్చి త
త్కరివరకుంభమౌక్తికలతాతతిం బూచె నిజాసిపుత్రికను. ౧౨

చ. అతనికిం బుట్టి రొప్ప మధురాంతకపొత్తపిచోడసిద్ధిభూ
పతియును మల్లిదేవండును బాహుపరాక్రమవిక్రమక్రములు
నతనరనాథభాల[10]కషణస్థిరపాదసరోజవైభవులు
వితతసముద్రకాంచ్చి పరివేష్టితభూపరిరక్షణక్షములు. ౧౩

క. క॥ ధరం బొత్రపి[11]సిద్ధినరే
శ్వరునికి నుదయించ్చి భూమి సన నేలిరి స
చ్చరితులు పొత్తపిసోమీ
శ్వర[12]దేవండు మల్లిదేవవసుధాధిపుండును. ౧౪

ఉ. త్రి॥ భూపదిలీపుండై పరగుపొత్తపిసిద్ధని తమ్మ మల్లధా
త్రీపతికిని సమస్తజగతీపతికిని సుతు లుద్భవించ్చి రా
శాపరిపూర్ణ[13]కీర్తులు భుజాబలవర్తులు నైన తొంట్టియ
ర్యోపిలిసిద్ధియుం గులసముద్ధరణుం డగుమల్లిదేవండును. ౧౫

క. క॥ ఆపొత్తపిసోమీశ్వర[14]
భూపతికిం దమ్ము మల్లభూపాలున క
ర్యోపిలిసిద్ధికిం దమ్ముండు
దీపితసితకీర్తి మల్లిదేవండు వరగెను. ౧౬

9. మన్మండు- అని యుండవలయును. 12. సోమేశ్వర అని యుండవలయును.
10. ఫాల- ,, 13. పూర్ణ ,,
11. బొత్తపి. ,, 14. సోమేశ్వర ,,

చ. త్రి॥ పరగిన మల్లిదేవజనపాలుండు పొత్తపిచోడవంశశే
ఖరుం డినవంశకర్త యనంగాం గడు వాలి విరోధిరాజసం
హరణుండు దొంటితాతలక్రియం దగుపొత్తపిరాజధానిగా
ధర సకలంబునేలె విదితంబగుబాహుపరాక్రమంబునను. ౧౭

క. ఆమల్లిదేవనికిం గుల
భామాతిలకంబు పుణ్యభాగిని గౌరీ
శ్రీమహాదేవికిం బుట్టెం ద
పోమహిమ ఫలమ్ము ధాన పొడ వైనగతిని. ౧౮

క. ఇనుం డుదయ మైన యట్ల
మ్మను వుదయం బై నయట్లు మఱి రఘురాములు
జనియించ్చినట్లు గులవ
ర్ధనుం డోపిలిసిద్ధివిభుండు దానుదియించ్చెను. ౧౯

మ. త్రి॥ కరికాలోత్తమరాజవంశమునం దా గౌరీమహాదేవికిని
సురభులు గల్పకుజాతములు రసనదీతో(యంబు)[15] సింత్తామణులు
ధరనేకాక్రితిం బుట్టెనో యన జగదాంగ్కుండై [16] యిచ్చు దీ
నుర కిమ్మోపిలిసిద్ధివల్లభుండు గన్నుకందన్నువన్నికంపంగా[17] ను

ఉ. ఓపిలిసిద్ధివల్లభు జయోన్నతుం డేంకణచక్రవర్తి నా
జ్ఞాపరిరక్షితాఖిలదిశావలయును ఘనదానకన్నులీ
లాపరిపూర్న్న[18] రమ్యశుభలక్షణమూర్తి జయంత్తు నశ్వసి
తా[19] పురుహూతుం బేరుకొనంగాం జనుంజోడకులైకభూషణును.

---

15. సురనదీస్తోమంబు- అనియుండనోపు. 18. కణ్నులీలాపరిపూర్ణ్న- అనియుం
16. జగద్దానాంక్షుండై ,, డవలయును.
17. గణ్నుకందన్నువణ్నికంపంగా ,, 19. శిష్టా- ,,

మ. సకలాధీశనతోత్తమాంగ్గమణిభూషారమ్యపాదాంబుజుం[20] దా
టకనారాయణు భానువంశ నృపచూడారత్ను సిష్టేష్టుబం[21]
ద్ధుకవీంద్రద్విజరక్షుం గాస్యప[22] సుగోత్రుం బాటక[23] వ్రాతపు
త్రకు మా యోపిలిసిద్ధిం జెప్పందగు నుద్యద్గండగోపాలునిని. ౨౨

చ. త(న)నిజవృత్తి మింద[24] విదితంబుగ నోపిలిసిద్ధి విన్నసి
ద్ధనకు నన్గుందమ్ముండు[25] ప్రతాపమునం జని కమ్మనాండు సే
కొని గణపతీశు[26] దయం గూడి తదాజ్ఞ వహించ్చి యేలెం బా
వనమగు నాఱువేలును నవక్రపరాక్రమవిక్రమంబునను. ౨౩

వ. ఇ శ్లోలి సప్తసంతానంబులు దేవబ్రాహ్మణదత్తులు సమస్త ధర్మ్మం బులుం బ్రతిపాలించ్చి॥ స్వస్తి చరణసరోరుహావిహితవిలోచన త్రిలోచనప్రము ఖాఖిలపృథ్వీశ్వర కారితకావేరీతీర కరికాలకుల రత్నప్రదీపాహితకుమారగజాంకుశ యొఱయూరిపురవరాధీశ్వర సూర్య్యవంశోద్భవ కాస్యపగోత్ర[27] తెంక్కణాదిత్య జగదొబ్బ గండ్డ కీర్తినారాయణ సమస్తప్రశస్తి సహితంబు శ్రీమనుమహా మండలేశ్వర యోపిలి సిద్ధనదేవచోడమహారాజులు స్వస్తి శ్రీశక వర్షంబులు ౧౧౭౬ గు ఆనందసంవత్సర కార్త్తికశుద్ధ శ్రీ యేకాదసిశుక్రవారమునం గమ్మనాంటిలోన నిజరాజధానియైన కొట్టియదొన శ్రీశంకరేశ్వర శ్రీమహాదేవరకు గణపతిదేవమహా రాజునకు ధర్మ్మ(వు)గా హావిబఱలి యచ్చనలకు[28] నంగ భోగరంగభోగాలకు నందుల మొగడచెఱువు దేవభోగ మాచం

---

20. పాదాబ్జు- అని యుండవలయును.
21. శిష్టేష్ట- ,,
22. గాశ్యప- ,,
23. బాటక- ,,
24. మింద = మీఁద
25. ననుంగుందమ్ముండు-అనియుండవలయును.
26. గణపావనీశు- అని యుండనోపు.
27. కాశ్యపగోత్ర- అని చదువునది.
28. హావిబఱల్యచ్చనలకు- ,,

ద్రార్కతారకము సర్వకారపరిహారము[29]గా నిచ్చితిమి మంగళ
మహా శ్రీశ్రీ.

## 59.

శ. స. ౧౧౫౭.

(ఇది హైదరాబాదురాష్ట్రమునందు కరీంనగరముమండలములో ఉప్పరపల్లె గ్రామమున నొకదేవాలయములో రాతిస్తంభముమీఁద చెక్కఁబడినశాసనభాగము. Hyderabad Archæological Series No. 3. అనుపత్రికనుండి గ్రహింపఁబడినది.)

ఉ. శ్రీమదనూనదానజలసేవకుం బాయక మ్రోయుషట్పద
స్తోమనినాదము న్వినుచు సూరెల నెప్పుడుం బ్రస్తుతించు సి
ద్ధామరకోటికి న్వరదుండైన గణేశుండు సుస్థిరస్థితిం
గామసమానమూర్తి యగుకాటయ కీవుత మిష్టసంపదల్. ౧

క. చరణసరోరుహరాగ
స్ఫురణ న్మహిషునిశిరంబు వొలుపుగ సంధ్యా
భ్రరుచి నెనయ మెట్టిన స
త్తరుణాన్విత దుర్గ వరము గాటయ కొస(ం)గు౯. ౨

క. ఉరగేంద్రదిగ్గజములకుం
బరమోత్సాహముగ నాతపత్రమువోలె
న్ధర యెత్తిన కిరివరుం డగు
హరి గాటయ కీవుతము దయామతి శుభముల్. 3

క. దేవాదిదేవుం డమిత
స్థావరజంగమమయుండు సర్వేశుండు గౌ
రీ(వ)రుం డనవరతంబును
నీవుతం గాటయకు దయ నభీష్టఫలంబుల్. ౪

29. సర్వకరపరిహారము- అని చదువవలయును.

క. హరిదశ్వుం డజాచ్యుతశం
కరమూర్తిఁ ద్రయీమయుండు గమలాప్తుండు భా
స్కరుండు ద(యం గాచుచుండెడుం)
గరుణారసపూర్ణహృదయుఁ గాటయం బ్రీతిని. ౫

స్వస్తి శ్రీమదపారపారావారపరివృతమహీతలంబున సకలజన వినుతం బగునంధ్రదేశంబునకు (వి)భూషణం బైన యనుమకొండ యనుపురవరంబు నిజరాజధానిగా నొప్పుచున్న కాకతే భూపాలక్రమంబున జనవినుతయశోవిలాసుండును జయలక్ష్మీనివాసుండును నైనరుద్రనరేంద్రసుపుత్త్రుండును[1] సదారాధితత్రినేత్రుండును విబుధజనవనవసంతుండును రమణీయ్య[2]సీమంతినీజయంతుండును సకలజనమనోరంజనుండును నరాతిరాజమదభంజనుండును శరణాగతరాజశరణ్యుండును వినతాఖిలరాజవరేణ్యుండును ధైర్యామరసానుమంతుండును దు(రం)గమరేవంతుండును సత్యహరిశ్చంద్రుండును విభవామరేంద్రుండును నైన గణపతిదేవమహీనాథునకుం బ్రధానియై-

క. కనకాచలధీరుండు జన
వినుతచరిత్రుండు గార్యవిదుం డినతేజుం
డనఘుండు గుణనిధి బెజ్జమ
తనయుండు బుధదీనభానుతనయుం డనగాఁ. ౬

మ. ప్రతిపక్షక్షితిపాలకుంజరమదప్రారంభసంరంభ ము
ద్ధతబాహానిహితప్రచండనిశితోద్యత్ఖడ్గధారానఖా

1. గణపతిదేవుఁడు రుద్రనరేంద్రునితమ్ముఁ డైనమహాదేవునికొడు కైనట్లు పెక్కు శాసనములం దున్నది.

2. రమణీయ- అని యుండవలయును,

హాతి భేదించి యఖర్వ్వగర్వ్వబలశౌర్యస్ఫూర్తిం గంఠీరవా
కృతియై (సన్నుత) వృత్తి దాల్చి వెలసెను రే(చెర్ల)రుద్రుండిలన్.

సకలజనవినుతయశుండును గుణగణాలంకారుండును నైన కా ద్రెడ్డికి(ం) సౌభాగ్యసౌందర్యచాతుర్య్యంబులు గలిగి[3] పరగిన పరమపతివ్రత యైన బెజ్జమాంబకుం బ్రియనందనుండును ననవరత ధర్మ్మసమేతుండును పతిహితాచరణుండునుం గాక తెరాజ్యభార ధౌరేయుండును సద్గుణప్రఖ్యాతుండును నతులబలపరాక్రమసమన్వితుండును నైన రేచెర్లరుద్రునకుం బ్రధాని.

క. కులతిలకుండు వసుధామర
జలధిసుధాకరుం డశేషజననుతచరితుం
డలఘుండు రిపుతరుదావా
నలుం డనంగాం బరగె రాజెనాయకుం డుర్వ్విని. ౮

బోర్కైరలోని వీరభటావలి వధించి గోధుమఱతి తలదెంచి ఉదగిరి[4] సాధించి పడిరాయనిం దోలి దాక్షారామభీమేశ్వరదేవర కక్షుయదీపంబు లుసిపి ధర్మ్మసమేతుం డైనరాజెనాయకునికి ధర్మ్మ(పత్నియు)సుచారిత్రయు వనితాలలామయు నైన రవ్వ(మాంబకు) సుపుత్త్రుండు.

క. సరనిధి[5] గంభీరుండు సు
స్థిరతేజుండు వంశశేఖరుండు దయా
కరుండు బుధాంబుజదళశత
కరుం డని వర్ణ్ణింప[6] నొప్పుం గాటయధాత్రీని.

3. చాతుర్య్యంబులుం గలిగి- అని చదువునది.
4. ఉద్దగిరి- అని యుండనోపు.
5. శరనిధి- అని చదువునది.
6. వర్ణ్ణింప- ,,

(దీనిపిదప నొకపెద్దవచనము గలదు. అందు కాటయ ౧౧౫౭ వ శకసంవత్సరమునకు సరియైన "మన్మథసంవత్సరమాఘశుద్ధ ౧౫ గురు వారమునాండు పంచలింగాలకును పెంచరపల్లిసీ" దానము చేసి నట్లున్నది.)

## 60.

### శ. స. ౧౧౫౯.

(ఈశాసనము గుంటూరుమండలమునందు కాజగ్రామములో అగస్త్యేశ్వరస్వామి యాలయము తూర్పుగోడమీఁద చెక్కఁబడియున్నది.)

స్వస్తి సమధిగతపంచమహాశబ్ద మహాసామంత మహాసామంతాధిపతి మహాప్రచండదండనాయక పదవిరాజమానులైన (శ్రీ)మహా(దం)డనాయక మల్లినాయకుండు తమతల్లి కొామరమదేవులకు ధర్మార్థంపుంగాం గ్రాంజ ఐతీశ్వరమహాదేవరకు అఖండదీపానకుం బెట్టిన మేంకలు ౭౫।

(దీని తరువాతఁ గొన్నియక్షరములు భూమిలోఁ గప్పవడి పోయినవి.)

సీ. నుతనిధిశరరుద్రమితశకసమపుష్య
సితవసుతిథి సూర్యసుతదినమున
మకరసంక్రమవేల సకలధరాధినా
థుండగుచోడని దండనాథుం
డనఘుండు మల్లన దనమాతగొామరమాం
బికకు ధర్మార్థపుగాంగం బ్రీతితోడ
కనకాద్రిస్థైర్యంబం (డ)ఖండదీపక్తికి సప్త[1]
వింశతిగొరుల[2] వెలయనిచ్చి

1. పంచ- అని యుండనోపు. 2. గొఱ్ఱెల- అని యుండనోపు.

అచల(పు త్రి)పతికి నైతీశ్వరాంకున
కమరగణనమద్పదాంబు(జు)నకు
వరదునకుం ద్రిలోకవంద్యున కెత్తించె
దీప మఖిలలోక దీపకముగ. ౧

## 61.

శ. స. ౧౧౭౩.

(ఇది కృష్ణామండలములో వేదాద్రిగ్రామమందు లక్ష్మీనరసింహస్వామిగుడిలో ఒకఱాతిమీఁది శాసనము. Government Epigraphist's Collection No. 307 of 1924.)

సీ. శ్రీశక(భూపా)భిషేకవత్సరములు
గుణముని(భూ)చంద్రగణన మాఘ
విశదపక్షంబున దశమియు సోమవా
సరమున గణపతిక్ష్మాతలే(ంద్ర)
(ర)మనియ్యు[1] కార్యభారకుండు (వాయ...ం) కంటి
కాక.........నుత్పలదళాక్షి
సూరమాంబకుం గీర్తిసారోదయుం డన్న
యకుం బుణ్యముగ జగత్ప్రకటితముగ
శ్రీవిభాతి సూరేశ్వరదేవదేవు
శివు భవానీశు సుప్రతిష్ఠితునిం జేసె
దేవతులితుండు ధారుణీదేవకులుండు
దామనామాత్యుం డాచంద్రతారకముగ. ౧

క. శ్రీరమణామంత్రి దామయ
కోరిక దగ లెంకవంటి కోభితవి[2]

---

1. రమణీయ- అని యుండవలయును.
2. కోకవినుతవి- అని యుండవలయునేమో.

స్తారప...దయుండై (శ్రీ)
సూరేశ్వరదేవు పేర శోభితుండయ్యెఁ. ౨

చ. వెలయ నుమేశ్వరాయతనవిస్తర మొప్పంగం జేసి యందు నం
దులం దనరించి చిత్రవితతులు ప్రతిభ ప్రచియింపంబంచి పే
శలముగ మంటపంబు విలసన్నతి[3] ప్రిత్తముగా నొనర్చ్పెఁటం
బొలుపుగం బ్రస్తుతింపం దగుం బోచయదామనిం గీర్తిఁ ధామునిఁ.

సీ. ఈహితసిద్ధిగా నేగ సూరేశ్వర
దేవ(దే)వుని సుప్రతిష్ఠ సేసె
ఆదేవునకు భోగ మచ్చోట నిరువుట్టీ
యుత్తమక్షేత్రంబుం గ్రొత్తచెఱువు
వెనుకదక్షిణభాగమున రెండు మఱుతులుం
దగువ్రిత్తి యాచంద్రతారకముగం
గొమరైన లోహితగోత్రుండు దామనా
ర్యాత్మజుం డగుపోచనార్యుఁ ప్రుత్రుం
డంచితముగ దామనామాత్యుం డిచ్చె (శ్రీ)
గణపతిక్షితీశకార్యభరణ
భవ్యమూర్తి లెంకవంటి కోకునకు న
వ్వార్యకుం బుణ్యముగ జనస్తుతముగ. ౪

---

## 62.

శ. స. ౧౧౭౫.

(ఈశాసనము నెల్లూరుమండలములో ఒంగోలుతాలూకాలోని చండలూరుగ్రామమందు రామలింగేశ్వరస్వామి యాలయమునెదుటనున్న ఱాతిమీఁద చెక్కఁబడియున్నది. Nellore Inscriptions Vol. 2. No. 238.)

---

3. విలసన్నతి- అని యుండవలయును.

శా. శ్రీశాఖాబ్దము[1] లింద్రియాద్రిశశిధాత్రీసంఖ్యగా విస్ఫుర
ద్వైశాఖంబున సప్తమిని దివసక్రీడ్వారంబునన్[2] షడ్వింశ[3]
గీశుం బ్రీతిం బ్రతిష్ఠసేసె వరభోగేంద్రుండు సేవైకవి
ద్యావరుండు[4] చతుర్త్థ[5]వంశుండు బుధాధారుండు మారుండిల్లన్.

స్వస్తి సమస్తప్రశస్తిసహితరి శ్రీమన్మహాప్రధాని సర్వాధికారి మాయిదేవపెగ్గడ తంనేలిన అద్దంకి సింగ్గళదేవనికి తనకూ అభివిద్ధిగా చెందలూరి చెంనామల్లినాధదేవర (అసంపూర్తి.)

---

## 63.

### శ. స. ౧౧౭౭.

(ఈశాసనము కృష్ణామండలములో బెజవాడలో ఇంద్రకీలపర్వతము నడుగున శిలమయిన మంటపములో నొకజాతిస్తంభముమీఁద చెక్కఁబడియున్నది- South Indian Inscriptions Vol. IV. No. 716. ఆజాతిమీఁదనే యీశాసనముపైని శ. స. ౧౧౭౭ లో గొంటూరినారాయణదేవరాజుల ప్రధాని కూచెనపెగ్గడ అఖండదీపము పెట్టించిన ట్లున్నది. ఈశాసనము కూడ నాకాలమునందే పుట్టిన ట్లూహింపవచ్చును.)

ఉ. (పాత్రు)ల స్తత్సీంద్రుల విపశ్చిదనీకముం బ్రోచి నీ(తిచే)
ధాత్రికి నెంత్తయేనియు ముదం బొనరించిన యీపరాంగనా
పుత్త్రుండు దస్మునారి బలింబోలి మహీతల మేలుం గావుతను
ధాత్రియు నబ్జమిత్త్రుండు సుధాకరుండుం గ్గలయంనత్తాలమును.

---

1. శాకాబ్దము- అని యుండవలయును.
2. దివసరాడ్వారంబునన్- అని యుండనోపు.
3. ఇచ్చట గణము తప్పినది- సరియైనపాఠము చింత్యము.
4. విద్యాశూరుండు- అని యుండనోపు.
5. చతుర్థ- అని యుండవలయును.

## 64.

శ. స. ౧౧౮౪.

(ఈశాసనము గుంటూరుమండలములోని పెద్దకాకాని గ్రామములో వేణు గోపాలస్వామియాలయము నెదుట నున్న యొకశిలాస్తంభముమీఁద చెక్కఁబడి యున్నది. South Indian Inscriptions Vol. IV. No. 700.)

శ్రీశకరాజాభిషేకసంవత్సరంబులు ౧౧౮౪ ధుందుభిసంవత్సర మాఘశుద్ధదశమియు గురువారమునాండు కోటకాకాంటిని కీర్త్తిశ్రీగోపినాధనిని మాణికము ప్రతిష్ఠసేసి తిరుముట్ట మెత్తించి అంగరంగభోగములు దేవునికి సమర్ప్పించె.

క. కందం॥ శ్రీకీర్త్తి గోపినాధునిం
గాకాంటిపురేశుం గొలిచి కౌస్తుభరత్న
శ్రీ కనురూపము నాంగా
లోకములో మాణికము వెలుంగ్గుచు నొప్పెను. ౧

క. వినుతింప మానికమునకుం
దనయుండు గీర్త్తియన బుట్టి ధర్మ్మపరుండ్డై
వనజోదరు శ్రీకార్య్యము
నొనరంగం జేయించుచుండ్డె నుత్తమచరితను. ౨

(దీనితరువాతిభాగము చాల ఖిలమైనది.)

---

## 65.

శ. స. ౧౧౯౭.

(ఈశాసనము గుంటూరుమండలములో నంబూరుగ్రామమందు మల్లేశ్వ రాలయములో నొకఱాతి స్తంభముమీఁద చెక్కఁబడియున్నది- South Indian Inscriptions Vol. IV. No. 703.)

క. (ధర)రిసి(ని)ధిరుద్రసమితిం
(బర)గంగ భాద్రపదక్రిష్ణపంచమి గు(రువా)

సరము(న)సంగయకాముండు
చిరతరముగ మండపంబు (స్సే)యించె ధరణ్. ౧

---

## 66.

### శ. స. ౧౨౩౫.

(ఈశాసనము కృష్ణామండలములో గణపేశ్వరగ్రామమందు దుర్గాంబగుడిలో నొకఱాతిస్తంభముమీఁద చెక్కఁబడి యున్నది- South Indian Inscriptions Vol. IV. No. 952.)

సీ. స్వస్తి సమస్తరాజన్యచూడామణి
కిరణరంజితపాదసరసిజా(తుం)
డగుకాకతియ్యధరాధీశు(శ్రీ)వాకి
లికి నంగరక్షుడై ప్రకటశౌర్య్య
ధనుం డనం బరగి యమ్మనుజేంద్రుం డొసగిన
వెలనాంటినాయకస్థలము వృత్తిం
బెనుపొందం బడసిన పెదనీలినాయని
యగ్రనందనులు భయార్త్తిహారులు
పురుహూతనిభుం డగు బోల్లైయ[1]నాయుండు
నాయకాగ్రణి గాళినాయకుండు
ననంగం (బ)రగి రవని నతులప్రతాపసం
పన్ను లధికబాహుబలులు ఘనులు[2]. ౧

ఉ. వారియనుంగ్గుందమ్ముండు సువన్నణ[3]గిరింద్రసమానధైర్య్యణం డం
భోరుహమిత్రతేజుండు ప్రభుత్వసమగ్రుండు వల్లినాయకుం

---

1. బొల్లైయ- అని చదువవలయును.
2. ఈపద్యములో సీసపాదము లైదును గీతపాదములు రెండును గలవు.
3. సువర్ణ- అని చదువవలయును.

డారంగ నగ్రజా న్మతి[4]ననంతసమంచితధర్మ్మకార్య్యములు
ధీరుండు సేయుచుండ్డుం దగ దేవగురుద్విజపూజ లొప్పంగాను. ౨

చ. వరగుణరత్నరాసి యగువల్లెయ[5]కును శివపాదపద్మష
ట్చరణపతివ్రతాగుణవిశాలయశోనిధి యన్నమాంబకును
వరసుతుండైనపోచయ యవార్య్యభుజాబలశౌర్య్యశాలి సుం
దరజితమన్మథుండ్డు రుచిధాముసు తేజుండుదారమూర్త్తియై. 3

సీ. తమతల్లిదండ్రులకు[6] ధర్మ్మవు రాజ్యాభి
వృద్ధియుంగాం దనబుద్ధిం గోరి
శరగుణరవిమిత శకసమాసితపుష్య
సురపతితిథియును గురుదినమును
వెలనాంటిలోపల వినుతింపంగాం బేరు
గలిగి క్రిష్ణాబ్ధిసంగమమునందు
పోలుపైన పెదదీవిపురమున గణపతీ
శ్వరదేవునకు గొని కరము నేథ
యుంటి[7]నొసగి పెయ్య లేంభది[8] వెరసినూ
రును నఖండదీపమునకు భక్తి
దనరంగా రవీందుతారకముగ నిచ్చి
పుల్లరియును విడిచె భూనుతుండు. ౪

కామరాజుగడ్డను సుక్షేత్రము యేందుము॥ శ్రీ॥

---

4. అగ్రజానుమతి- అనునది సాధురూపము కాని యట్లు దిద్దిన ఛందోభంగమగును.
5. రాశి యగువల్లెయ- అని చదువునది.
6. తల్లిదండ్రులకును ధర్మ్మవు- అని చదువవలయును.
7. సేంబదింటి- ,,
8. లేంబది- ,,

# 67.

## శ. స. ౧౨౫౮.

(ఈశాసనము గుంటూరుమండలములో నకరికల్లుగ్రామమునందు నరసింహస్వామియాలయములో నొకఱాతిమీఁద చెక్కఁబడియున్నది.)

క. శ్రీనారీసహితుండై
శ్రీనరసింహుండు తనదు సేవాపరులను
శ్రీనగరకంటి నెప్డును
శ్రీనిలయులంజేసి కరుణం జేకొనికాచును. ౧

శ్లో. సదా నగరకంటీశో నృసింహో భక్తవత్సల[1]
తరంగితకృపాదృష్ట్యాః[2] పాయా ద్వో స్సార్వకాలికం[3]. ౨

క. స్వస్తి శ్రీశకవర్షాస
విస్తరణం బెట్టిదనినం వేయిటిమీంద[4]
నిస్తారం మిన్నూఱును[5]
ప్రస్తుతి నేంబదియు నాల్గు వరలెడిచోటను. 3

సీ. శ్రీముఖనామసంవత్సరము వైశాఖ శితపక్షపంచమి
నాదివారమున మధ్యాహ్నమందు
నగరకంటను శాంతనరసింహదేవర
సంనిదా ..మననంతలమునను[6]

---

1. వత్సలః- అని చదువునది.
2. దృష్ట్యా- ,,
3. పాయాద్వస్సార్వకాలికమ్- అని చదువునది.
4. మీంద్ని- అని చదువవలయును.
5. నిస్తారమ్మిన్నూఱును- ,,
6. అక్షరములు కొన్ని లోపించుటచేత సరియైనపాఠము నిర్ణయించుట కష్టముగాకయున్నది.

జగములు ప్రోవం బాంచాళిపురంబు శ్రీ
గోపళయ్యామనసు కోర్కిదీర్ప
అరుగ భూవరు ణిచ్చె[7] నని చెల్లనిచెను[8]
బుద్ధాంకుం బొంబది[9] పుట్లపొలము
అదియు నూరుగా సమర్పించెం జెనుకాలి
సింగవిభుండు నారసింహ్వనకును
నారసింహ్వపురము నలినొప్పచు నన
వేమ మహీంద్రు[10] పుణ్యవిహార మయ్యె. ౪

---

## 68.

శ. స. ౧౨౯౮.

(ఈశాసనము గుంటూరుమండలములో అమీనబాదాగ్రామమందు మూలంగూరమ్మగుడి యున్నకొండమీఁద చెక్కఁబడియున్నది.)

సీ. శాకాబ్దములు సహస్రమును నిన్నూంటతొం
బదియెనిమిది యగు భవ్యసంఖ్యం
గలిగి యొప్పారెడు నలవత్సరంబున
మాఘమాసము పూర్ణిమాదినమున
విశ్వోత్తరుం డన వేమభూపాలుండు
దమకులస్వామిని కమృతకిరణ
శేఖావతంసకు శ్రీమూలంగూరస్థ
కఖిలజగన్నాథ కంగరంగ

---

7. భూవరుం డిచ్చె- అని యుండనోపు.
8. నిచ్చెను- అని చదువవలయును.
9. డేంబది- ,,
10. నలినొప్పచున్న నసవేమ మహీపు- అని యుండనోపు.

కొలక పిశాచవథూటి దా నుత్సహించె
రాయగజగౌడగంగథూరమణుం డాజి
సమరం జెండ్లి[5] కొడుకు మల్లావనీశుం
జెలంగి సురకాంతతోం బెండ్లిసేయునపుడు. 3

ఉ. పన్ని తురంగమంబునకుం బక్కెరవెట్టినవార్త (హేళి) రిచే
విన్నభయంబునం గలంగె వీసరనాండునుం జక్రగో(ట్ట)మును
మన్నియ (వఙ్గక్షోణియ) మ(ల...ద్యన) వేంగి గళింగ లాదిగాఁ[6]
నిన్నియు నొక్కనాండ.......(నే)లువ భీమనృపాలుధాడికిని.[7]

(ఈచివరపద్యమునకుఁ బైపద్యముతో సంబంధ మున్నట్లు తోఁచదు.)

---

## 70.

### శ. స. ౧౩౦౩.

(ఈశాసనము గోదావరీమండలములో దాక్షారామమున భీమేశ్వరాలయములో నున్నది- South Indian Inscriptions Vol. IV. No. 1379.)

శకవరుషంబులు ౧౩౦౩ గు నేంటివైశాఖ శు ౧౦ గు ।

సీ. నంద్దిదీపావలి నాట్యకల్యాణహా
మశనివారగయాక్షమంటపములు
తిరుచుట్టుమాలియ దివ్యలింగ్గంబుల
గుళ్లు వజ్రంపురాకోట గోపు
రములు వాతాళిగేహములు సోపానభాం
డాగారవివిధధాన్యాలయములు

---

5. జెండిలి- అని చదువవలయును.

6. ఈపాదమునకు సరియైనపాఠము నిర్ణయింపవీలులేకున్నది.

7. ధాటీకిని- అని కాని, దాడికిని అని కాని యుండవలయును.

వంటయిండ్లు[1] సతుద్వారకవాటములు
ప్రేమ దాక్షారామభీమనాథు
నగర నాచంద్రతారకోన్నతులు దిశల
వెలయం జేయించ్చె నన వేమువేమరాను(?)
విజయ[2]చండ్ర ధాముని[3]జగనొబ్బిగండ్డం డహిత
ఖండనోద్దండ్డదోర్దండ్డమండ్డనుండు. ౧

ప్రకాశభారతీయోగికావ్యం। పెద్దనాచార్య్యలిఖితం(శ్రీ)।

---

## 71.

శ. స. ౧౩౦౩.

(ఈశాసనము దాక్షారామములో భీమేశ్వరాలయమున నున్నది. శాసనకాలము చెప్పఁబడలేదు, కాని, కావ్యకర్త యొక్కఁడే కావున ౭౦ వ శాసనము నిది యు నేకకాలమునందే పుట్టియుండు నని యూహింపఁదగి యున్నది- South Indian Inscriptions Vol. IV. No. 1380.)

సీ. అమరాద్రి భీమేశ్వరావాస మబ్ధిస
ప్తకము (శ్రీ)సప్తగోదావరంబు
వలయాచలేంద్రంబు వజ్రపుత్రాకోట
గులపర్వతంబులు గోపురములు
దిరుచుట్టుమాలియ యరవిందజాండ మ
మర్త్యలోకము నాట్యమంట్టపంబు
పరివారదేవతాభవనంబు లీచతు
దశభువనంబులు (ద్వా)రకములు

---

1. యిండులు- అని చదువవలయును.
2. విజయ- అను పద మధికముగా నున్నది.
3. చండ్డధాముండ్డు- అని యుండనోపు.

గనకకుంభతతులు గాంగ దాక్షారామ
మన్నవో(ంతు)వేమనానుజుండు
గడు నపూర్వ్వ[శ్రి]ష్టి[1] గావించి వాసన
కెక్కె శ్రీవేమ సితయశుండు[2].

ప్రకాశభారతీయోగికావ్యం। పెద్దనాచార్య్యలిఖితం॥

## 72

శ. స. ౧౩౩౧.

(ఈశాసనము గుంటూరుమండలములో శిరంగిపురముగ్రామమందు వీరభద్రస్వామిగుడి యెదుట శిలాస్తంభముమీఁద చెక్కఁబడియున్నది. Epigraphia Indica Vol. XI.)

సీ. శాకాబ్దములు సహస్రమును మున్నూంటము
ప్పదియొక్కండును నైన భవ్యసంఖ్య
వఱలువిరోధిసంవత్సరంబున ఫాల్గు
నంబున బహుళపక్షంబువిదియ
శుక్రవారంబున శుభముహూర్తంబున
శ్రీధాన్యవాటిపురాధిపతియుం
గ్రిష్ణవేణ్నాజలక్రీడావినోదుండు
నగుగన్నభూపాలుననుంగుంబుత్రి
వీరనారాయణుండు వేమవిభునిదేవి
భూరిసద్గుణనికురుంబ సూరమాంబ
జగము వినుతింప సంతానసాగరాఖ్య
వరతటాకప్రతిష్ఠోత్సవం బొనర్చె. ౧

1. సృష్టి- అని చదువనది.

2. నాల్గవపాదము "శ్రీలక్కె వేమసితయశుండు" అని యుండనోపు.

సీ. జాహ్నవీయమునాదిసకళపావననదీ
విమలతీర్థాంభఃపవిత్రితంబు
సవిధదేశస్థాయి[1] శివమౌళిబాలేందు
కౌముదీసంఫుల్లకైరవంబు
బహుమహాపరివాహపాథోభరధ్వాన
ఘుమఘుమాయితదిశాగోళకంబు
జలసారణీసేకసంవర్ధితానేక
వనవినీతాధ్వగాధ్వశ్రమంబు
బలవదురుమత్స్యకచ్ఛపడుళికుళీర
తిమి తిమింగిళ విక్రమక్రమవిహార
తరళతరతుంగభంగకదంబచుంబి
తాభ్రవీథి సంతానమహాపయోధి. ౧

సీ. కపటసూకర మైనకైటభాసురవైరి
ఖురపుటంబులం బరిక్షుణ్ణ మయ్యె
రఘుకులోద్వహధనుర్యంత్రముక్తము లైన
చిచ్చుఅమ్ముల వేండిం జేవదఱిగెం[2]
గుంభసంభవునిహస్తాంభోరుహంబున
నాపోసనం బయి[3]ప్రాస మొందెం
బాషాణముల నచ్ఛభల్లగోలాంగూల
కపియూథములచేతం గట్టువడియె
వనధి యేభంగి సరివచ్చు ననంగవచ్చు
నారసాతలగంభీరవారి యగుచు
నపగతాపాయ మగుచు శోభాఢ్య మగుచు
ననుపమం బైనసంతానవనధితోడ. ౨

1 స్థాయి- అని చదువునది. 3. సాపోశనం బయి- అనిచదువునది.
2 దఱిఁగె- ,,

(దీనితరువాత నీయర్థమునే తెలుపు సంస్కృతపద్యములుగలవు.
ఆపద్యముల చివర-

విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః
అకరో౯ దాకరో౯ వాచాం నిర్మలం ధర్మశాసనం.

అనియున్నది.

---

## 73.

శ. స. ౧౩౩౭.

(ఈశాసనము గుంటూరుమండలములో అమీనాబాదాగ్రామమున కీశాన్యమూల నున్న ఫుల్లరిబో డనుకొండ పసుమటిప్రక్కను వరాలగాది యను బండ కుత్తరముగా చెక్కఁబడియున్నది- Government Epigraphist's Collection No. 543 of 1909.)

సీ. శాకాబ్దములు సహస్రంబును మున్నూంట
 ముప్పదియేడును యొప్ప[1] మిగుల
మహనీయ మైనమన్మథవత్సరంబున
 మఖమాసమునం బూర్ణిమాదినమున
హేమాద్రిదానచింతామణి యరిరాయ
 బసువశంకరుం డాజిఫల్గునుండు
సమదారిరాయవేశ్యాభుజంగుండు వే
 మయ రాచవేమనక్ష్మావరుండు
దల్లిసూరాంబచే సముత్పన్న మగుచుం
బరగు సంతానవార్ధికి వరువగాంగ
నొలయు గిరివాహినుల జగనొబ్బగండ
కాలువ ఘటించె నాతారకంబుగాంగ. ౧

శ్రీనాథకృతి.

---

1. నొప్ప- అని చదువునది.

## 74.

### శ. స. ౧౩౩౯.

(ఇది కృష్ణామండలము నందిగామ తాలూకాలోని వేదాద్రిగ్రామమందు లక్ష్మీ నరసింహస్వామి గుడిలో నొకరాతిమీఁద చెక్కఁబడియున్నది- Government Epigraphist's Collection No. 306 of 1924)

శుభమస్తు, స్వస్తిశ్రీశకవత్సరంబులు ౧౩౩౯ అగు నేంటి హేమళంబ్బి సంవత్సర శ్రావణ శు ౫ గు స్వస్తి శ్రీమన్మహామండ్డలేశ్వర మహారాయ రాయపరమేశ్వర అవఘళిరాయమానమద్దన శింగ్గిణీ ఠంకార రాయపక్షిసా(ళు)వా బిరుదప్రతాప పేరోజ(సు)లుతాను రాజ్య ప్రతిష్ఠాప(నా)చార్య్యండైన మసదనయేలిఅబి( )బునిదామలు మలక వోడయు(ల)ంగారి అనుజన్ముండైన శరఖుమలుక జైనదివోడయలు తూర్పుదేశము క్రిష్ణవేణ్యాతీరం వోడపల్లి వజీరుబాద యేలుచుంన్న తననిజహితుండైన యీజదిమలుకంగారిని శ్రీకృష్ణవేణ్యాతీరము శ్రీరంగ్గరాజుకొండ్డ యేలం బుత్తెంస్తేను సకళధంమ్మములలోనుంన్ను పరమధంమ్మ మని తమవోడయులైన జైనదిమలుక వోడయులకుంన్ను నిదామలునులుక వోడయులకుంన్ను పేరోజుసులుతాని ఖోందాలమ్మంగారికింన్నిం బుణ్యముగాను జైనదిపురము చెఱువు గట్టించ్చి అంన్నదాన వుదకదానములు వెట్టి శ్రీరంగ్గరాజుకొండ్డ శ్రీకృష్ణవేణ్యా నీళ్లతేప్ప పృథివింన్ని అకాశముంన్నుం . గలకాలము ఆచంద్రార్క్కస్థాయిగాను సోపానములు గట్టించి పృథివి రాజ్యము చేయుచుండ్డెను.

శా. శ్రీరంగక్షితిపాలుశైలమునకుం జెంనొంద్దువాయవ్యమం
దారంగ్గాం దగు నీజదీమలుక దానాచంద[1]తారార్క్క పై

1. చంద్ర- అని యుండవలయును,

భూరంగం బగుం గృష్ణవేణ్యుదరళీ*పూతోదకప్రాప్తిచే
(సా)రంగ్గాఖ్య వహింప్పంజేశె వారా†సోపానమార్గ్గంబిలన్పూ.
మంగ్గళమహా శ్రీ శ్రీ౦ శేయును.

## 75.

శ. స. ౧౩౩౯.

(ఇది 74 వ శాసనము క్రిందనే యున్నది. Government Epigraphist's Collection No. 307 of 1924.)

గీ. వొరుండు చెసిన ధర్మ్మంబు వుండ్డనీక[1]
చెఱిచి ధర్మ్మంబు దనదని చేశినట్టి[2]
నరుండు అఱవది[3] వే లేండ్లు నరకమంద్దుం
గూలి క్రిమికీటకాకృతిం గుంద్దుచుండ్డు. ౧

[4]శ్లో. శ్రీకృష్ణాతటినీతటోన్నతతమా శ్రీరంగ్గభూపాచల
ప్రాగల్భ్యాధిప యాజిదీమల్లు(జి)కృత్వాయశోధామకం
సోపానాంకితశాసనప్రకటితం శాకాబ్దరుద్రోద్భవ
శోచిత్రేశశి హైమళంబిశరదాద్యావాసరే శ్రేయశే శ్రీ శ్రీ.

సీ. తగవును ధంమ్మంబు దయయును నేప్రొద్దం
దనమునంబునం గలిగి[5]దనరు నితండు

---

*శటినీ- అని యుండనోపు. †నవురా- అని చదువవలయును.

1. ఒరుండుచేసినధర్మ్మంబు నుండనీక- అని చదువునది.
2. చెఱిచిధర్మ్మంబు తనదని చేసినట్టి- ,,
3. అఱువది- ,,
4. సంస్కృతశ్లోకము రెండవపాదములో ఛందోభంగము కలిగినది. నాల్గవ పాద మనన్వయముగా నున్నది.
5. గల్గి- అని చదువునది,

సత్రంబుఁ జలివంద్రి సతతంబు వేడ్కతో
విలశిల్లంగం[6] బెట్టి వెలయు నితండు
ముదమంద వేమాద్రి[7] యుంద్రేవు క్రిష్ణకు
సోపానములు దీర్చెఁ జతురుఁ డితండు
చెఱువులుం బెండ్డిండ్లుం[8] జేయించెఁ బ్రేమతోఁ
గలిగిన సత్కీర్తిఁ ఘనుం డితండు
అనుచుం గొనియాడుదురు నిన్ను నఖిలసభల
మలుక మహాబూపు వరపుత్ర కలితఘాత్ర[9]
దానగుణశీల నిర్మ్మల[10] ధర్మ్మలోల
మహితగుణసాంద్ర యీరెడ్డిమలుకచంద్ర. 3

శుభమస్తు.

---

## 76.

### శ. స. ౧౩౫౦.

(ఈశాసనము గోదావరీమండలములో పిఠాపురమునందు కోటపేఁటలో నున్న తాలిమసీదు వీథియరఁగుమీఁద నున్న యొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. ఈమసీదులోనే వేఱొకచోఁ నున్న యింకొక శాసనములో "స్వస్తి శ్రీశకవర్షంబులు ౧౩౫౨ అగు నేంటి సాధారణసంవత్సర మాఘ శు ౭ శు గోంటిమాధవ పెరుమాళ్ళకును వాసిరెడ్డి పోతినేండు నగరిదక్షిణభాగాన లక్ష్మీదేవస్థ నగరు కట్టించి ప్రతిష్ఠ చేయించెను." అని యున్నది.)

---

6. విలసిల్లంగం- అని చదువునది.
7. వేదాద్రి- అని యుండనోపు.
8. బెండ్లిండ్లు- అని చదువునది.
9. గాత్ర- ,,
10. నిర్మల- ,,

సీ. నిండ్డె నెవ్వనికీర్తి నిఖిలలోకంబ్బుల
        చంద్రికావిస్ఫార¹సాంద్రగరిమ
వుండ్డె² నెవ్వనియింట్ట పుణ్డరీకాక్షుని
        ప్రాణవల్లభ యైన పద్మనయన
(పం)డ్డె నెవ్వనికృపాపాథోధి నిలయెల్ల
        ధాన్యసంపూర్న³వదాన్య యగుచు
మండ్డె నెవ్వనికోపమహిమానలంబుచే
        అరివీర⁴గేహంబు లక్షణంబ్బ
అనుచుం గొనియాడుదురు నిన్ను నఖిలసభల
వేమభూపాలకారుణ్యవిమలపాత్ర
ప్రబలకర తేజ వాసయప్రభుతనూజ
మనుజదేవేంద్ర పోతకుమారచంద్ర. ౧

## 77.

### శ. స. ౧౩౫౪.

(ఈశాసనము విశాఖపట్టణమండలములో పంచధారలగ్రామమందు శ్రీధర్మలింగేశ్వరస్వామిగుడిలో ఆస్థానమండపము దొకటాతిమీఁద నున్న శాసనములోఁ జిట్టచివరభాగము. దీనికి ముందున్న గద్యములో "శ్రీశుభాభ్యుదయ శకవర్షంబులు ౧౩౫౪ అగు నేంటి పరిధావిసంవత్సర వైశాఖశు ౧౫ మొదలుగాను చంద్రవంశ్యుండైన నాగేంద్రదేవచక్రవర్తికిని భవానిదేవమగారికిని సుపుత్రుండైన కుమారయెఱ్ఱమయంగారు పరమేశ్వరప్రీతిగాను ఆయాదేవస్థానాలయందుల దేవళ్ళకు సమర్పించ్చిన ధర్మాల వివరం" అని యున్నది. South Indian Inscriptions Vol. VI. No. 663.)

1. విస్ఫార- అని చదువునది.
2. నుండ్డె ,,
3. సంపూర్ణ- అని చదువునది.
4. నరివీర- ,,

ఉ. (శ్రీ) శ్రీ(త)వ(త్స)ం డిద్దకులసింధుసుధాకరమూర్తి సంతతో
పాశ్రితబంధురక్షణకృపావశవర్తి చతుస్సముద్రస
మ్మిశ్రితకీర్తి లోభినృపమిండం... డికరి[1]సర్వలో
కాశ్రయచక్రవర్తిమహిమాధ్యుండునాగయమెఱ్ఱండుర్విలోను.

---

## 78.

శ. స. ౧౦౫౩.

(ఇది గుంటూరుమండలములోని ఎనమదలగ్రామమందు వీరేశ్వరస్వామి గుడి ప్రాకారముమీఁద నున్నశాసనము.)

సీ. గుణబాణగతిచంద్ర గణనంబు శాలివా
హనశకవర్షంబు లవనియందుం
బరగు నందనభాద్రపదశుద్ధదశమిని
సోమవారమునాండు ప్రేమతోడ
నెనమదల* వీరన్న కిరువుగాం బ్రాకార
మును భోగరాగంబు లనువు పఱచె
తననాథుం డయ్యపదండనాయకునకు
పుణ్యంబుగా నని బుధులుపొగడ
తారతారకమందారశారదాభ్ర
తుహినహిమకరవిఖ్యాతినహారహంబు
గెలుచుసత్కీర్తి ధనముగా మెలంగ నేర్చు
మల్లనరనాథుచినబొమ్మమనుజవిభుండు. ౧

స్వస్తి శ్రీజయాభ్యుదయ శాలివాహనశకవరషంబులు ౧౦౫౩ అగు నేంటి నందనసంవత్సర భాద్రపదశుద్ధ ౧౦ సోమవారమునాండు

---

1. గణము తప్పినది.

* ఒకమాత్ర యధికముగా నున్నది. 'ఎనమదల' అని చదువవలయును.

రాయసం అయ్యపరుసయ్యవారు కొండవీటిసింహాసనము పాలించం గాను ఆయన సేవకుండు చినబొమ్మనాయండు వీరేశ్వరుని ప్రాకారము ఖమండపములు సమర్పించెను॥ ఆయన మఱది బాణాల వీరయ్య పడ కము సమర్పించెను॥

---

## 79.

### శ. స. ౧౪౬౦.

(ఈపద్యము గుంటూరుమండలములో కొండవీటికోట యుత్తరపు (కొండపల్లి) ద్వారము కుడివైపుగోడమీఁద చెక్కఁబడియున్నది. అచ్యుతదేవరాయలు శ. స. ౧౪౫౧ ప్రాంతమున రాజయ్యెనుగావున నీశాసనము శ. స. ౧౪౬౦ ప్రాంతమునఁ బుట్టిన దనవచ్చును.)

సీ. నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకార
నవకంబుగా గోపినాథపురము
నిలిపినాం డేమంత్రి నియతవైభవముల
గోపికావల్లభుం గూర్మి వెలయ[1]
పాలించె నేమంత్రి ప్రకటధర్మఖ్యాతి
మహిమమీరంగ నంధ్రమండలంబు
గెలిచినాం డేమంత్రి లలితవిక్రమమునం
బ్రబలుండై యవనులబలము నెల్ల
నతండు భూపాలమంత్రీంద్రసతతవినుత
ధీవిశారదుం డచ్యుతదేవరాయ
మాన్యహితవర్తనుండు శౌర్యమహితయశుండు
భానుతేజుండు రామయభాస్కరుండు. ౧

---

1. గూర్మి వెలయ. అని చదువఁబడెను.

## 80.

శ. స. ౧౪౬౨.

(ఈపద్యములు గుంటూరుమండలమునందు వంకాయలపాడుగ్రామములో గోపి సముద్ర మనుపెద్దచెఱువు గట్టుక్రింద నున్నశిలాస్తంభముమీఁది పెద్దసంస్కృతశా ు చివర నున్నవి. ఈశాసనములో కర్ణాటరాజగు అచ్యుతదేవరాయలమంత్రి రామ ాస్వరునిసోదరియు "ప్రతాపయల్లప్రభు" ధర్మపత్నియు నగుచిన్నాంబ గోపీనాథ ద్ర మనుపేర నొకతటాకమును ౧౪౬౨ వ శకసంవత్సరమందుఁ ద్రవ్వించె నని బడినది.)

చతురజనానీతనస్తపావననదీ
తీర్థపవిత్రితాధికజలంబు
సవిధదేశవిశాలసరసరసాలాది
ఫలరసజంబాలభాసురంబు
కలకంఠచంచ్చరీకశుకకలాలాప
కలితమందమనోజకౌతుకంబు
ఘటితకుల్యాగతఘనసీరసంచ్చార
సంవర్ధితానేకసస్యచయము
చక్రవాళాచలోపమచారుసేతు
బంద్ధబంద్ధురసీరంధ్ర(భా)సురోర్మి
చుంబ్బితా(ంబ)ర మత్యంతసుకృ(   )ణిస
నాథశుభనిధి శ్రీగోపినాథజలధి. ౧
జనతృష్ణమాన్పని జలముం బూనకయున్న
పవనజుచే దాంటంబడకయున్న
మంథానభూధరమథితంబుగాకున్న
మాంటిమాంటికి నుబ్బి మరలకున్న
గరళంబు దనలోనం గలిగి లంగకయున్న[1]
నొకవే(ల)లోంబడి యుండకున్న

1. లోఁగకయున్న - అని యుండవలయునా ?

(బ)డబాగ్నికీలలం బరిత(పిం)ప్పకయున్న
నోడంగూడి( )నవారి నోరయకున్న
జలధి సరివచ్చు మాధుర్యచారుజలము
నపగతా(ఖి)లదోషంబు నగుచు ధరణిం
దననదీనత్వమహిమచే ననుదినంబు
వెలయు శ్రీగోపికానాథజలధితోడ. ౨

సీ. శ్రీమించు గన్నడక్షితివరాచ్యుతరాయ
సన్మంత్రిరత్నంబు జలజనాభు
పాదాబ్జసేవాతిభాసురహృదయుండు
కొండవీటీధరామండలేంద్రుం
డైనరామయభాస్కరామాత్యుసోదరి
యనఘ ప్రతాపయల్లార్యపత్ని
పర్వతేశ్వరదేవు భక్తిం బ్రతిష్ఠించి
గ్రామా(ది)భోగము ల్గలుగంజేసి
చిన్నమాంబిక నిజ(కృ)తస్థిరతరాగ్ర
హారవంతాలపాటిశు(భా)పరాఖ్య
రామచంద్రపు(రా)భ్యర్ణసీమయందు
విప్ర(స)త్ఫలసంధానవిమలమతిని. 3

సీ. కర్ణాటభూపాలఘనకృపాక(లి)తవి
స్తీర్ణగజా... ... ... ండు
చండప్రతాపభాస్కరుండు భాస్కరదండ
నాథుసోదరి మహోన్నతగుణాఢ్య
పూని షోడశమహాదానవిద్యాప్రౌఢిం
జిరకీర్తి గనిమన్న చిన్నమాంబ
దుగ్ధాంబునిధితోడం దులదూంగు గోపికా

నాథసముద్రంబు నలువువిూర
ధరణిం గట్టించ్చె నాచంద్రతారకముగ- ౪

(అసంపూర్ణము.)

(ఈపద్యములలో మొదటిపద్యము మాత్రమే మాతృకనుబట్టి నేను వ్రాసినది. తక్కినవి వంకాయలపాటి సత్యనారాయణ యనునాయన వ్రాసి పంపినవి. వీనిలోని వర్ణక్రమ మెల్లెడల యథామాతృక మని చెప్ప ననువుపడదు. శ్రీనాథుని ఫిరంగిపురశాసనపద్యముల ఛాయ యీపద్యములందు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది.)

---

## 81.

శ. స. ౧౪౭౫.

(ఇది గుంటూరుమండలములో దుగ్గిగ్రామమందు వంకేశ్వరస్వామి గుడి ముఖమండపములో నొకఱాతిస్తంభముమీఁద నున్నశాసనము శ. స. ౧౧౭3 ప్రాంతమందు నాము దేవపండితులు తమతండ్రి వాయిపండితులపేర వంకేశ్వరదేవుని బ్రతిష్ఠచేసినట్లు మఱియొకశాసనమునం దున్నది.)

సీ. కాకతాంవ్వయు డైన[1] గణపతిదేవని
పండితుం డగువాయిపండితుండు
యేపార[2] దుగ్గవంకేశ్వరదేవుని
ప్రతి[3] నూత్ననగరప్రతిష్ఠ శేశె[4]
క్రితము మున్నూ రేండ్లకిందట ఇప్పుడా[5]
నగరికంభము[6] ఱాలు పగిలియున్న

---

1. యుడైన- అని చదువునది.
2. ఏపార- ,,
3. ధృతి- అని యుండనోపు.
4. సేసె- అని చదువునది.
5. క్రిందట నిప్పుడా- ,,
6. కంబము- ,,

మలిపించ్చి తెప్పించి నిలిపించె కంభముల్[6]
తలంపు[7]గోచరమైన తరము లెత్తి
జగతి ఆచంద్ర[8]తారార్క-మగుచు నెరయ
నికిలజను లలర ప్రఖ్యాతిని వహించె[9]
(భాగ్యసవుభాగ్యనిధి)[10] పరమవైష్ణవసజ్జనపారిజాత
కోరి సద్గుణమణి పెదకూరపాటి(వంశాబ్ధిచంద్ర)
దీపితోదారి మాదయగోపశవురి.[11] ౧

ప్రమాదీచసంవత్సర పుష్యశు ౧౦ సో॥ కూరపాటి గోపినేడు దుగ్గవంకేశ్వరదేవుని కంభంప్రతిష్ట సేశను.

---

## 82.

### శ. స. ౧౫౦౦ ప్రాంతము.

(ఇది కర్నూలుమండలములోని ఎగువ అహోబలమందు అహోబలస్వామి యాలయముగోడమీఁద నున్న పద్యము. వ్రాఁతతప్పులు పెక్కులు గలవు. లిపినిబట్టి శాసనము ౧౫౦౦ ప్రాంతము దనవచ్చును.)

సీ. తిరిగెం గవ్వంబై శరధిలో నొకకొండ
పుగ్భనివిల్లయ్యె నొకకొండ
ఆలంగా(చు)టకై హరియెత్తె నొకకొండ
పుదధిలోపల దాంగె నొకకొండ

---

6. కంబము- అని చదువునది.
7. తలంపం గోచరమై,,
8. నాచంద్ర- ,,
9. నిఖిలజగములం బ్రఖ్యాతిని వహియించె- అని యుండనోపు.
10. కుండలీకరణములు చేసినభాగములు విడిచినచో నైదు గీతపాదము లగును, పెక్కుచోటుల విసంధు లున్నవి.
11. శౌరి- అని చదువునది.

రయమునఁ బెకలించె రావణుం డొకకొండ
స్రుక్కెం గుమారుచే నొకకొండ
వరముని ఆజ్ఞ గర్వ మణంగె నొకకొండ
వుర్విం జుట్టుపెట్టె నొకకొండ
వున్నకొండలుం గపులెత్తి రుదవిడిని
చారుధీరత సీతోడ సవతుసేయ
తెన్నివిధములం దలంచిన యింకం గలరె
అలఘుదోర్దండ పీఠెతిమ్మయకొ(ండ). ౧

---

వ్రాంతతప్పులు మెండుగా నుండుటచే వానిని సవరించి యిప్పటి వర్ణక్రమానుసారముగాఁ బైపద్యము క్రిందఁ జూపఁబడినది.

సీ. తిరిగెఁ గవ్వంబయి శరధిలో నొకకొండ
యుగ్రునివి ల్లయ్యె నొక్కకొండ
యాలఁ గాచుటకునై హరియెత్తె నొకకొండ
యుదధిలోపల దాఁగె నొక్కకొండ
రయమునఁ బెకలించె రావణుం డొకకొండ
స్రుక్కెఁ గుమారుచే నొక్కకొండ
వరముని యాజ్ఞ గర్వ మణంగె నొకకొండ
యుర్విఁ జుట్టులు పెట్టె నొక్కకొండ
యున్నకొండలఁ గపులెత్తి రుద్ధవిడిని
జారుధీరత సీతోడ సవతుసేయ
నెన్నివిధములఁ దలఁచిన నింకఁగలవె
యలఘుదోర్దండ పీఠె తిమ్మయ్యకొండ,

---

## 83.

### శ. స. ౧౫౧౪.

(ఈపద్యము గుంటూరుమండలములోని అమీనబాదాగ్రామమందు మూలాంకు రమ్మగుడి తూర్పుద్వారము కుడిప్రక్కను చెక్కఁబడి యున్నశాసనములో నిమిడియున్నది. ఇది గోలకొండరాజయిన ఇభరాం (Ibrahim) పాదుషాగారి సేనానాయకుఁడైన అమీనాలమలక (Amin-ul-mulk) గారు శ. స. ౧౫౧౪ కు సరియైన నందనసంవత్సర వైశాఖశు 3 గురువారమునాఁడు చెక్కించిన ప్రతాపధర్మశాసన మని యున్నది. ఇభరాంగారు కొండవీడురాజ్యమును సంపాదించిన విషయమును జెప్పుటకవసరమువ నీపద్యము చెప్పఁబడినది.)

"మొదలను శాలివాహనశకవర్షంబు లగు ౧౫౦౨ అగు నేందు విక్రమసంవ్వత్సర చైత్ర బ ౧౪ భవుమవారంనాండు హాజరత్ యిభరాహిం పాదశహావొడయలుంగారు తమనామజాదు అంపితేను-

దాటగ[1] నేంగి వుద్ధగిరి[2] దాకొఁని వెంకటరాజుం ద్రోలి ముం
గోటలు లగ్గవట్టి వినికొండ్డయు బెల్లముకొండ్డ తంగ్గెడల్
పాటపరిణ హారించ్చి మరి బల్మిని గైకొనె కొండ్డవీడు క
ర్ణాటకరాజధాని యిభరాముండు బాహుబలంబు మీరుచునూ.

యీలాగు ప్రతాపాన కొండవీంటి రాజ్యం పుచ్చుకొని రాజ్యం పరిపాలిస్తున్న వుండ్డను.

---

## 84.

### శ. స. ౧౫౨౭.

(ఈశాసనము కడపమండలము సిద్ధవటము ప్రాంతకోటయొక్క తూరుపుద్వారము గోడమీఁద చెక్కఁబడియున్నది. Government Epigraphist's Collection No. 564 of 1915.)

---

1. ధాటిగ- అని చదువవలయును.
2. యుద్ధగిరి- ,,

స్వస్తి.

శాకే శాంబ్బక[1] బాణభూపరిమితే వ[ర్షేచ వి]శ్వావసా
వాన్నత్యేన చిరాయుషాచ గుణభాజా చంద్రతారం భువి॥
యస్యా నంత్తనృపేణ తేన జనకే నైవోటుకూరీరణే
ప్రాప్తస్సిద్ధవటో య ముజ్వలశిలాసాలో విశాలః కృతః॥

సీ. [శాలి]వాహననామశకవర్షములు వేయు
నేనూంటయిరువది యేడు చనిన
విశ్వావసు వసంగ్గ వెలయు వత్సరమున
సకలహిందూరాజ్యసార్వభౌమ
వీర వేంకటరాయవిభుండు చంద్ర[గిరీంద్ర]
సీమసామ్రాజ్యంబ్బు సేయుచుండ
జంబ్బులమడకభూసంగ్రామజయశాలి
కటకపురీచూరకారహారి 2
నందేల క్రిష్ణమనరనాథభయదాన
దక్షదోర్దండ విచక్షణుండు
అఖిలకర్నాటసింహాసనాధీశ్వర
దక్షిణబాహాభిధానధారి
విదళితకొండ్రాజు వెంకటాద్రి విభుండు
చెంన్నూరిహారణసంపన్నగృహుండు
విబుధస్తుతకకుస్థవిజయప్రబంధాది
కావ్యనిబంధనగ్రంధకర్త 3
శ్రీమదెల్లమరాజు చెరువు[పే]ర తటాక
ఘటనానుభావసంఘటితయశుండు

1. శాకేఽత్ర్యంబక- అని యుండనోపు.

ద్రవిడభూమధురాదిధాటీచలద్రయ
బలరక్షణాక్షీణబాహుబలుండు
పెనుగొండ్డసమరయావనపాదుషాగర్వ
ఖర్వీకరణచణాఖర్వభుజుండు.
ర[ం]గమాంబ్బాకుమారవతంసరత్నంబ్బు
పరభీమబిరుదులభాఖుబండ్డి ౪

విమతావనీశ్వరవేశ్యాభుజంగ్గుండు
బల్లరగండాంకభాసురుండు
మన్నెహంవ్వీరుండు మగలరాయుండు[రా]చ
బెబ్బులి పరరాజభీకరుండు
మల్లి తివెణంగ్గళమానవాధిపరత్న
రత్నాకరుం డనంత్తరాజశౌరి
తమతండ్రి యల్లభూరమణుండు ...
తిరుపతి రాజుపైం బెరిగికొట్టి ౫

తనకత్తిమొనం దెచ్చుకొనిన[సి]ద్ధవటంబు
చెల[ంగత][2]నపేర చెరువుసేసె
హృదయ ముప్పొంగ సిద్ధవటేశ్వరునకు
ఔపచారికమైన సాలాంత్తరముగ
పురముచుట్టును వరణమై పరిణమింప్ప
ధాత్రిం గట్టించ్చె నాచంద్రతారకముగ. ౬

2. చెలంగంగం దనపేర-అని చదువునది.

## 85.

### శ. స. ౧౫౩౮.

(ఈపద్యము నెల్లూరుమండలములో ఆత్మకూరుతాలూకా కుల్లూరుగ్రామమందు శివాలయముదగ్గఱ నున్న యొకశాతిమీఁద చెక్కఁబడియున్నది. పద్యమునకుఁ బూర్వ భాగమునం దున్నవచనములో "శాలివాహనశకవర్షంబులు ౧౫౩౮ అగు నేంటి పరి ధావిసంవత్సర కార్తిక బ ౧౨ సో॥ నాఁడు చింతపట్ల రుద్రప్పనాయఁడు అనంత సాగర మను చెఱువు తూర్పుకటలుఁగునకు "ముప్పదిమూఁడుశిలాస్తంభాలు నిలిపి యిరుగ డల సంతనిసారువులు సోపానాలు కలుగు" కట్టించిన ట్లున్నది—నెల్లూరి శాసనములు-౧-౨౮౫)

సీ. అవగాహనేహాసమాయాతవిబుధరా
ట్కమనీయ్య[1] మణిశతాంగము లనంగ
తాటాకసేతుసందర్శనేచ్ఛాగత
స్థితసమున్నతమహాశిఖరు లనగ[2]
నీతి నుజ్వలధతానేత్రసంపాదిత
మూర్తిభస్త్రీతిమూతుఁ లనగ[2]
ముక్తామణీయుక్త మోహనాంబరచుంబి
వరుణరాజన్యగోపురము లనగ[2]
నిలిపెం గుల్లూరి నల్లచెర్వులుగునద్దు
ముప్పదియుమూఁడు[3] రాకంబములుం జెలంగ
చింతపట్లపురస్థాయి శ్రీనిధాయి
రుచిరగుణహారి చెంచయరుద్రశౌరి. ౧

---

1. కమనీయ- అని చదువవలయును.
2. లనంగ- ,,
3. మూఁడు- ,,

# 86.

శ. స. ౧౨౭౮.

(ఈపద్యములు గుంటూరుమండలములో అమరావతిగ్రామమందు అమరేశ్వరదేవాలయము మండపములో నొకశిలాపలకమీఁద చెక్కఁబడియున్న శాసనములో నున్నవి. Government Epigraphist's Collection No. 260 of 1897)

ఉ. యింద్య్రుండు ధాన్యవాటి నమ్ర తేశు ప్రతిష్ట యొనర్చ్చె పంటరె
డ్డీంద్య్రుండు అన్న వేమధరణీశ్వరుచే శె పునఃప్రతిష్ఠ ఆ
చంద్రదినేంద్రతారకము శాశ్వత మవునని యీశ్వరాజ్ఞచే
హంద్రికె పెద్దమంత్రి సుగుణాంబుధి నిల్పెను సుప్రతిష్ఠయును. ౧

చ. వరవసువేదబాణశశివర్న్నితమౌ శకవత్సరంబులను
అరయంగ అక్షయాబ్దమున హంద్రికె కోనయపెద్దమంత్రి యి
ద్ధరవిచంద్రతారకము దన్నలకోట అమరేశలింగమును
స్తిరతరభక్తితోడ ప్రతిష్ట యొనర్చ్చె పుణ్యశాలియై. ౨

ఈపద్యములందు దోషములు మెండుగా నుండుటచే వానిని సవరించి యిప్పటివర్ణక్రమమును బట్టి యీక్రిందఁ జూపుటయైనది.

ఉ. ఇంద్రుఁడు ధాన్యవాటి నమ్ర తేశుఁ బ్రతిష్ఠయొనర్చెఁ బంటరె
డ్డీంద్రుఁడు అన్న వేమధరణీశుఁడు చేసెఁ బునఃప్రతిష్ఠ యా
చంద్రదినేంద్రతారకము శాశ్వతమౌ నని యీశ్వరాజ్ఞచే
హంద్రిక పెద్దమంత్రి సుగుణాంబుధి నిల్పెను సుప్రతిష్ఠయున్. ౧

చ. వరవసువేదబాణశశివర్ణితమౌ శకవత్సరంబుల
న్నరయఁగ నక్షయాబ్దమున హంద్రికె కోనయపెద్దమంత్రి యి
ద్ధర రవిచంద్రతారకము దన్నలకోటమరేశలింగమున్
స్థిరతరభక్తితోడను బ్రతిష్ఠ యొనర్చెను బుణ్యశాలియై. ౨

## 87.

శ. స. ౧౬౦౦.

(ఇది కృష్ణా మండలములో నందిగామగ్రామమందు రామలింగేశ్వరస్వామి గుడి మండపములో నొకఱాతి స్తంభము మీఁది శాసనము. Government Epigraphist's Collection No. 252 of 1924.)

చ. అరయంగ శాలివాహనశక*హాయనముల్ వెయి నారునూరువా
మరిదగు పింగళాబ్దమున మాఘమునందలి శుద్ధపంచ్చమిన్
విరివిగ వాశిరెడ్డి ఘనవీరయరామన నంద్దిగామలో
స్మరహరుకై యొనర్చ్చెఁ ముఖమంటపమా శశి†భాస్కరంబ్బుగనూ.

## 88.

శ్రీముఖ.

(ఈశాసనము కృష్ణామండలములో బెజవాడగ్రామమందు మల్లేశ్వరాలయములో విఘ్నేశ్వరునిమందిరమునెదుట నొకఱాతి స్తంభము మీఁద చెక్కఁబడియున్నది. శక సంవత్సరము లేదు. South Indian Inscriptions Vol. IV. No. 775.)

(శ్రీ)ముఖసంవత్సర మాఘశు ౫ ఆ దాసమహంతి కుమారుఁడు శివమహాపాత్రుని-అంన చొకాఇపాత్రుడు మల్లేశ్వరుని గుళ్లోని కేశవ నాధని గుడి సుంనం శేయించెను॥

శా. ఔ రాదాసయచొక్కపాత్ర(ం)డుసమౌంన్నత్యదానవారాశి(యై[1]
(శ్రీ) రంజిల్లై (డి)మోటుపీపురి(ం) బ్రతిష్ఠించెఁ ముదంబొప్ప(ం)గాం

*శాలివాహశక- అని చదువవలయును. †శశి- అని చదువవలయును.

1 పాత్రుం డసమానౌన్నత్యవారాశి యై- అని యుండనోపు.

దా రేందుగ్రహసూర్య(మై) వెంచి[2] దక్షాధ్వరధ్వంసునిఁ
కారుణ్యాకర[3]మానసాంబురుహిణీకళ్యాణ[4]వీరేశ్వరుఁ. ౧

శ్రీ శ్రీ శ్రీ జేయునుఁ.

---

2 వెలయంగా- అని యుండనోపు.

3 గారుణ్యాకర- అని చదువునది.

4 మానసాంబురుహాంనిం గల్యాణ- అని యుండనోపు.

---

[illegible] శాసనములు

సంపూర్ణము.